## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..





నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి.కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్ధం మహానుభావులైన **వికాస ధాత్రి** వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **వికాస ధాత్రి** వారి వెబ్ సైట్: http://www.vikasadhatri.org/
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం ఉచితంగా eBook రూపంలో **వికాస ధాత్రి** వెబ్ సైట్ వారు అందించటం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు వారికి గలవు,కనుక వారిని సంప్రదించగలరు.

**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

# వికాస ధాత్రి వారి వెబ్ సైట్:

## http://www.vikasadhatri.org/

Vikasa Dhatri | :: Downl

www.vikasadhatri.org

Home | Novels | Poetry | Stories | Biography | Videos | About Us | Contact

### Download Telugu Books Free

Vikasa Dhatri offered more than 160 Telugu eBooks for free download so far. Most of the books are in PDF. Some books are in Page Flip mode and these can be read online.

Read more

### Swaparipalana

Article 243(A) of the Constitution of India has enabled the State Legislatures to empower Gram Sabha by endowing them with certain statutory powers. Sections 45, 161 and 192 of the APPR Act 1994 have entrusted certain specific functions to Panchayat Raj Institutions as mentioned in Annexure-I. Gram Sabha is a constitutional body and the nucleus of democratic power in the local governance system; it is the basic unit for village development and decentralised planning. Gram Sabha acts as a platform for peoples' participation, maintains surveillance of various development activities implemented in the village(s), raises issues relating to the village(s) concerned, and ensures transparency and accountability in the functioning of Panchayat Raj Institutions and line departments at the grassroots level.

**Categories:**

Act

Read more

Find us on Facebook

Vikasa Dhatri

Like

590 people like Vikasa Dhatri.

Facebook social plugin

NGO Funding Guide

సామాజిక సేవకు కార్పొరేట్ నిధులు ఏప్రిల్ 2014 నుంచి కార్పొరేట్ సోషల్ రెస్పాన్సిబిలిటీ క్రింద కొన్ని కంపెనీలు తప్పనిసరిగా సామాజిక సేవా కార్యక్రమాలు చేపట్టే విధంగా కంపెనీల చట్టంలో సవరణలను ప్రభుత్వం తీసుకువచ్చింది. దీని వలన 6000 నుంచి 8000 కంపెనీలు 20 వేల నుంచి 30 వేల కోట్ల రూపాయలను కార్పొరేట్ సోషల్ రెస్పాన్సిబిలిటీ క్రింద వ్యయం చేయనున్నాయి. సిఎస్ఆర్ నిధులను ఖర్చు చేసేందుకు అర్హమైన కార్యక్రమాలు, కంపెనీల పేర్లు, వెబ్‌సైట్ల వివరాలతో డిజిటల్ స్కూల్ రూపొందించిన ఎన్‌జిఓ ఫండింగ్ గైడ్ - 'సామాజిక సేవకు కార్పొరేట్ నిధులు'.

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# పిల్లల చేతుల్లో పెన్నిధి ప్రపంచ వారసత్వం

**(తెలుసుకో- పదిలపరుచుకో- పరిరక్షించుకో)**



రచన

**తురగా వసంతశోభ**

పర్యవేక్షణ

**తురగా జానకీరాణి**

**సుధామ**

## తురగా ఫౌండేషన్

29, జర్నలిస్టుకాలనీ, రోడ్‌నెంబర్.3,
బంజారాహిల్స్, హైదరాబాద్. 500034.
టెలిఫోన్లు: 23351153, 23357774.

PILLALA CHETULLO PENNIDHI- Prapancha Varasatvam
Telusuko – Padilaparuchuko – Parirakshinchuko

By

Turaga Vasanta Sobha
Conservation Architect

Published By
Turaga Foundation
29, Journalists' Colony,
Road # 3, Banjara Hills,
Hyderabad –500034.

CD & Book Design:
Usha Turaga-Revelli
Suryachandra Reddy
(Sai Tirumala Printers)

Printed By:

Price:

# అంకితం

అంత కడివెడు పాలపై
ఒక్కింత మీగడ పేరినట్లుగ
మనకు మిగులును గతములోపలి మంచి
అదియే సంప్రదాయం
అని సంస్కృతీ సంప్రదాయాన్ని నిర్వచించిన
విద్వత్కవివరేణ్యులు,
రిమ్‌జిమ్ రిమ్‌జిమ్ హైదరాబాద్ అంటూ
హైదరాబాద్ వారసత్వ స్ఫూర్తిని జనమమేకం
కావించిన
జ్ఞానపీఠ గ్రహీత,
నా కృషిని నిరంతరం ప్రోత్సహించి ఆత్మీయంగా
ఆదరించి ఆశీర్వదిస్తున్న

**డా॥ సి.నారాయణరెడ్డి గారికి**

# ముందుమాట

మనం అంతగా పట్టించుకోని విషయాలు కొన్ని వుంటాయి. వాటి గురించి పట్టించుకోవాలన్న ఊహ కూడా మనకు కలగదు. 'పనికిరానిది పన్నెండేళ్లు దాచమని' పెద్దలంటూ వుంటారు. అంటే నిజానికి పనికిరానిదంటూ వుండదనే అందులోని ఉద్దేశ్యం. కాలం గడిచే కొద్దీ పాతబడుతున్నాయి అని మనం అనుకునేవి, నిజానికి వాటి విలువను నాణ్యతను, వాటితో మన బంధాన్ని ఇనుమడింపజేస్తూ సరికొత్తదనాన్ని సంతరించుకుంటూంటాయి. వ్యక్తుల చరాస్థుల సంగతి ఏమోగానీ సమాజానికి, దేశానికి స్థిరాస్థులుగా నిలబడిపోయేవి వుంటూంటాయి. అవి వస్తువులు కావచ్చు, కట్టడాలు కావచ్చు, మరింకేవైనా మహోదాత్త నిర్మాణాలు కావచ్చు.

నిజానికి సంపద ధనరూపంగా కాదు, అనుభూతుల హృదయమథన రూపకంగా ఉంటుంది, పెరుగుతుంది. ఒకరి నుంచి ఒకరికి అది అందించవలసిన పద్ధతి కూడా అదే. నిజమైన సంపత్తి వ్యక్తిగతం కారు సమాజగతమే. ప్రపంచపు వింతలు అందరివీ. ప్రపంచ సంపదలుగా అలా పరిగణించాల్సినవి ఎన్నో వున్నాయి. వాటి గురించి తెలుసుకోవాలి. పదిలపరుచుకోవాలి. పరిరక్షించుకోవాలి. ఆ పని తరం నుంచి తరానికి నిరంతరం అందుతూండాలి. పట్టించుకునేలా కొన్ని అంశాలను పదేపదే చేయవలసి వుంటుంది. గుర్తు చేయవలసి వుంటుంది. వారసత్వం అలాంటి వాటిల్లో ఒకటి. వ్యక్తి వారసత్వాలకు, కుటుంబ వారసత్వాలకు ఆరాధనా పూర్వకంగా అంగీకరించి తలవొగ్గుతున్న పౌరులు సమాజానికి దేశానికి ప్రపంచానికి వారసత్వ సంపద కాగల వాటి గురించి శ్రద్ధ పెట్టకపోవడం చిత్రమే మరి.

ప్రపంచ వారసత్వ సంపదగా గుర్తింపబడే వాటిల్లో మనదేశ సంపద, మన నగర సంపద వుండడం ఎంత గర్వకారణం! అలా గుర్తింప చేసుకోగలగడం మన హక్కు. అయితే ఆ హక్కును బాధ్యతగా గుర్తించిన పౌరులెందరు? దేశం నాకేమిచ్చిందని కాక దేశానిక నేనేమిచ్చానని ఆలోచించడం నిజమైన జాతీయభావన.

పాఠశాలలో జాతీయగీతం పాడి ప్రతిజ్ఞ వాక్యాలు పలుకుతున్నప్పుడు 'మహోన్నతమైన నా దేశవారసత్వ సంపద నాకు గర్వకారణము' అన్నమాటను ఆచరణలో పెట్టగలగడం, ఆ సదవకాశాలకు పట్టుబట్టి సాధిచంబూనడం అందరికే చేతనయ్యే పని కాదు. 'ఎమ్మార్క్' చేసిన కుమారి వసంతశోభ వృత్తిరీత్యా ప్రవృత్తి రీత్యా కూడా ప్రపంచ వారసత్వ పరిరక్షణోద్యమంలో అభిరుచిని అభినివేశాన్ని పెంచుకుంది. హైదరాబాద్ నగరంలోని దాదాపు పది సముదాయాలకు ప్రపంచ వారసత్వ గుర్తింపు లభించే అర్హత వుందని నిరూపిస్తూ అందుకై ఆరాటపడుతోంది. ప్రపంచపటంలో మన దేశం, మనరాష్ట్రం, మన నగరం, ఈ రూపేణా స్థిరీకరింపబడాలని అభిలషిస్తోంది. అధికారగణాన్ని, ప్రభుత్వ యంత్రాంగాన్నీ ఈ ఆలోచనా సరళికి అనుగుణంగా శృతి చేసే పనిలో నిమగ్నమై పనిచేస్తోంది.

# పిల్లల చేతుల్లో పెన్నిధి ప్రపంచ వారసత్వం

'పిల్లల చేతుల్లో పెన్నిధి -ప్రపంచ వారసత్వం' అనే ఈ కృతి అందుకు తార్కాణం. వసంతశోభ ఇందులో తాను అధ్యయనం చేసిన భవన నిర్మాణకళను, వాస్తు సంపదను గురించి పిల్లలకు తెలియజేస్తూ తెలుసుకుని పదిలపరుచుకుని, పరిరక్షించుకోవాల్సిన వాటి గురించి, వాటికై మనం చేయవలసిన వాటిగురించి ఎంతో వివరంగా సచిత్రంగా రాసింది. ఇది పాఠ్యగ్రంథం కాదు. ప్రతి ఒక్కరూ పఠించి ఆలోచించవలసిన గ్రంథం. ఇవన్నీ ఆసక్తి కలిగించే విషయాలు, అనురక్తిని పెంచే అంశాలు. పిల్లలు వీటిని తెలుసుకుని వుండడం చాలా అవసరం. ఆలోచనల మొగ్గలు తొడిగితే ఆచరణల పుష్పాలు వికసించకపోవు. అందుకోవలసిన ఫలాలు అందుకోకుండా పోము. వసంతశోభ చెబుతున్న ప్రపంచవారసత్వపు ఈ శోభాయమాన సంగతుల్లోకి ప్రవేశించండి. ఈ పెన్నిధిని మీ చేతుల్లోకి తీసుకోండి.

**సుధామ.**



# మా సంకల్పం

మన వూళ్లల్లో ఏయింటికైనా వెడితే, "యిది మాతాతగారి పందిరిమంచం, మానాయనమ్మ యీ రాచిప్పలో పులుసు కాచేది. ఈ కంచుగ్లాసు నిండా పానకం చేసేవారు." అని చెప్పడం వింటూంటాం. అవన్నీ పాతసామాన్లు కదా, ఎందుకు, అవతల పారేయక దాచుకోవడం అనుకోము. అమ్మో తరతరాల నుంచి వున్న వస్తువులా అని ప్రేమ, ఆశ్చర్యం, మమకారం మనకి.

మరి బ్రహ్మాండమైన కట్టడాలు, కోటలు, రాచనగరులు, దేవాలయాలు, తాళపత్రాల మీద పురాణాలు, ఎప్పుడో గుహల్లో రంగుల చిత్రాలు, అడవులు, మృగాలు, ప్రకృతిలో అపురూప సహజ సంపదలు యివన్నీ ఎంత గొప్పవి! అవి కాపాడుకోవాలికదా! మనిషి మెదడు ఎంతో శక్తివంతమైనది. ఊహలు చిత్రాతి చిత్రమైనవి. ఆకాశాన్ని దాటిన ఎత్తు ఎదగగలదు. సముద్రాల లోతులలో చొచ్చుకుని పోగలదు. యుగయుగాల చరిత్రలో మహాశిల్పులు, కళాకారులు, రచయితలు, చక్రవర్తులు, ప్రజాపాలకులు ఎందరో! సామ్రాజ్యాలు అంతరించినా వారు నిర్మించిన అద్భుత చిహ్నాలు నిలిచివున్నాయి.

ఇవి అన్ని దేశాలలో, అన్ని ఖండాలలో వున్నాయి. 'ఇది' కట్టినది మా వాళ్లు. 'అది' మా సంపద అని సంకుచితంగా అనడానికి లేదు. మనిషి అపరబ్రహ్మగా సృష్టించినవి యావత్ప్రపంచానికి చెందినవి. సమస్త మావవాళీ వీటికి వారసులే. 'ఇదిమాది' అని ఒకరు కూలగొట్టడం చరిత్రకు మహాపచారం.

ఎవరు వీటికి వారసులు? నేటి యువత, రేపటి పౌరులు. వారు సగర్వంగా నిలచి, భక్తితో, ప్రేమతో వాటిని కాపాడుకోవాలి. ప్రభుత్వాలకి, నిరంకుశులకి, యీ అపారమైన పెన్నిధిని ధ్వంసం చేసే హక్కు లేదని యీ లేతకంఠాలు ధైర్యంగా చెప్పాలి. వారి చేతుల్లో యీ సంపదను గురించి వివరాలు కొన్నయినా వుంచడమే యీ చిన్న పుస్తకం లక్ష్యం.

ఐక్యరాజ్యసమితి సంస్థ 'యునెస్కో' బృహత్తరమైన ఈ అంశాన్ని గమనించి 1972లో 'ప్రపంచవారసత్వం' గురించి ప్రకటించి, ఆయా దేశాలలోని నగరాలను ప్రదేశాలను గుర్తించింది. సాంస్కృతిక, ఆర్థిక సహాయం చేస్తూ వాటి రక్షణకు కూడా సాయపడుతున్నది.

మనదేశం అతి ప్రాచీనమైనది. ఎంతో చరిత్ర కలది. కానీ ఆ ప్రాచీనవైభవాన్ని, మహోన్నత సంస్కృతిని పరిరక్షించుకొనే పద్ధతి లోపించింది. ఇందుకు రాజకీయ సంకల్పం కొరవడటం, అభివృద్ధి పనులకిచ్చిన ప్రాముఖ్యత ప్రాచీనతకు యివ్వకపోవడం ప్రజలలో వారసత్వం విలువలను గురించి అవగాహన లేకపోవడం యివన్నీ కారణాలే. అందుకే మనభారతదేశానికి అంతర్జాతీయ స్థాయిలో ఏ ఒక్క నగరానికి, పట్టణానికీ 'ప్రపంచవారసత్వ' హోదా లేదు. ప్రతిపాదన పంపే ప్రయత్నమే లేకపోయింది.

ఇంతటి విశాల భారతంలో ప్రపంచ వారసత్వ ప్రదేశాలుగా సుమారు 30కి యిప్పటి వరకు గుర్తింపు వచ్చింది. వాటిలో మనరాష్ట్రంలో ఒక్కటీ లేదు.

వాస్తుశిల్ప పరిరక్షణలో ఎమ్.ఆర్క్. డిగ్రీ పొందిన కుమారి వసంతశోభ గత తొమ్మిదేళ్లుగా యీ రంగంలో పోరాడుతూనే వుంది.

మనరాష్ట్రం, ముఖ్యంగా హైదరాబాదు నగర చరిత్ర వైభవం మీద మక్కువతో ఆమె తన స్వంతఖర్చుతో 450 పేజీల నివేదిక తయారు చేసి 2003లో ముఖ్యమంత్రి గారికి సమర్పించింది. ఆ నివేదిక పారిస్‌లోని యునెస్కోకి వెళ్లింది. వారు అక్కడి నుంచి 'ఆసక్తితో పరిశీలించాం, మీరు నామినేషన్ ఫారం నింపి పంపండి' అని జవాబిచ్చారు. అంతే! ఆ తర్వాత పట్టించుకున్న వారే లేరు. ఢిల్లీలో, హైదరాబాదులో అధికారులను కలిసి విజ్ఞాపనలు చేసింది నిండా ముప్పై ఏళ్లు లేని ఈ యువతి.

మన నగరంలోనే చరిత్ర, వాస్తు, శిల్పకళల విషయంలో నిష్ణాతులు వున్నారు. సమాచారాన్ని క్రోడీకరించి సమగ్రంగా ఒక నామినేషన్‌ను ఢిల్లీ వరకైనా పంపే ప్రయత్నం జరగలేదంటే ఎక్కడుంది లోపం? విలువైన కట్టడాలన్నీ కూల్చివేయకముందే మేల్కొనే యత్నం కావాలి.

వసంతశోభ దీనినొక ఉద్యమంగా చేపట్టినప్పుడు గౌరవనీయులు, ఆచార్య డాక్టర్ సి.నారాయణరెడ్డిగారు, రాజ్యసభ సభ్యులుగా, రాష్ట్ర సాంస్కృతిక మండలి అధ్యక్షులుగా, ఎంతో ప్రోత్సాహమిచ్చారు. స్వయంగా పారిస్‌లోని యునెస్కో వరల్డ్ హెరిటెజ్ సెంటరులో సంక్షిప్త నివేదికను అందించారు. ప్రొఫెసరు సి.లక్ష్మన్న గారు, మాజీ శాసనసభ్యులు, ప్రస్తుత ఎం.పి. శ్రీఅసదుద్దీన్ ఒవైసీగారు ఎంతో అండగా నిలిచారు.

ఈ పని ప్రభుత్వం చేత చేయించాలని ప్రయత్నించారు. కానీ 'ఎవరికి పుట్టిన బిడ్డరా ఎక్కెక్కి ఏడుస్తున్నది' అన్నట్లు వారసత్వ వైభవం నిరాదృతగా మూలపడింది. నెలకొక కట్టడమైనా కూలుతోంది. మనకింక ఏం మిగులు తుంది అని యువ ఆర్కిటెక్టులు అలజడి చెందుతున్నారు.

పత్రికలు, టి.వి వివిధ ఛానెళ్లు ఎన్నోసార్లు యీ విషయమై చర్చలు జరిపారు. ప్రశ్నించారు. కానీ ఫలితం శూన్యం. సంబంధిత ప్రభుత్వశాఖల అధికారులు ఎవరిని విచారించినా యీ వాస్తవాలు వెలికి వస్తాయి.

జరిగిన విషయాలు మరపులోకి రాకుండా, వారసత్వ పరిరక్షణ ఉద్యమం, మన నగర ప్రాచీనతకు గుర్తింపు తెచ్చే ప్రయత్నం పట్టుదలగా జరిపించాలని ఈ చిన్నపుస్తకం ప్రచురణకు పూనుకొన్నాం. ప్రపంచంలోని పారిస్, వెనీస్, రోమ్ వంటి నగరాలకు దీటైన సంస్కృతీ స్రవంతి యిక్కడ సజీవంగా వుందని ప్రపంచస్థాయి చరిత్రకారులు అంటుంటారు.

ఈ మంచిపని ఎవరిహయాములో జరగుతుందో అని ఆశగా చూద్దాము. వీలైనంత త్వరలో ఒక ప్రతిపాదన పంపితే మన స్వప్నం సాకారమైనట్లే.ఈ పుస్తకం తయారీలో సహకరించిన శ్రీయుతులు సుధామ, సి.వసంతభాను, శ్రీమతి పింగళి పార్వతీ ప్రసాద్‌గారికి మా ధన్యవాదాలు.

**తురగా జానకీరాణి**

# నా మనవి

ఏడెనిమిది క్లాసుల్లో వుండగా నాకు ఆర్కిటెక్చర్ మీద ఆసక్తి కలిగింది. దానితో ఎమ్.సెట్.వగైరాల ప్రవేశపరీక్షలు పూర్తి చేసుకుని జవహర్‌లాల్ నెహ్రు టెక్నలాజికల్ యూనివర్శిటీలో బి.ఆర్క్., ఆ తర్వాత ఢిల్లీలోని స్కూల్ ఆఫ్ ప్లానింగు అండ్ ఆర్కిటెక్చరులో ఎమ్.ఆర్క్ పూర్తి చేశాను. అదంతా మొత్తం ఎనిమిదేళ్ల తపస్సుగా సాగింది.

ఈ కాస్త అనుభవంతో నాలో మన ప్రాచీన వాస్తు శిల్పవైభవం మీద మక్కువ కలిగింది. విన్న వారికి చిత్రంగా అనిపించవచ్చును గానీ, భవనాలు నాతో మాట్లాడిన అనుభూతి ఒక్కోసారి కలుగుతుంది. వాస్తు శిల్ప సంరక్షణ అనే డిగ్రీ పొందినందుకు పరిరక్షణ నా కర్తవ్యంగా స్ఫురిస్తుంటుంది. కోఠీలోని మహిళా కళాశాలతో సహా హైదరాబాదులో అనేకానేక భవంతులతో నాకు విడదీయరాని బంధం ఏర్పడింది. అక్కడక్కడా ప్రాచీన కట్టడాలు కూలగొడుతుంటే ఏమిటీ దారుణం అని ఆవేదన, ఆగ్రహం కలుగుతాయి.

ఈ వారసత్వం గురించి పిల్లలకు చెప్పాలి. 1972 నాటి యునెస్కో ప్రపంచ వారసత్వ ప్రకటన గురించి ఈ పుస్తకంలో వివరంగా యిచ్చాను. ప్రాచీనతను రక్షించి. గత వైభవాన్ని నిలపాలనే ఆ మహాదాశయం నన్ను ముగ్ధురాలిని చేసింది. విశ్వజనీనమైన విలువలు కలిగిన కట్టడాలు మన హైదరాబాదులోను వున్నాయి.

వీటికి గుర్తింపు తీసుకుని రావాలంటే ఒక పద్ధతి ప్రకారం సేకరణ, క్రోడీకరణ, అంతర్జాతీయస్థాయిలో ఆమోదయోగ్యమైన నాణ్యతతో జరగాలి. ఈ తతంగం సుదీర్ఘమైనదే కానీ అసంభవం కాదు. తొలిప్రయత్నం 2003లో నాద్వారా ఆరంభమైంది. ప్రభుత్వమే దీనికి దరఖాస్తులు పంపాలి. కానీ అది జరగడం లేదు. పారిస్ వరకు నా నివేదిక వెళ్లినా, లాంఛన ప్రాయమైన చర్యలు లేవు.

నా శక్తి మేరకు నగరాన్ని చారిత్రక, వాస్తు, సంస్కృతి, జనజీవనం, నాగరికతలు ప్రాతిపదికగా పది ప్రాంతాలుగా సముదాయాలుగా విభజించి, వీలైనంత సవివరంగా చేసిన వివేదిక ఇంగ్లీషులో వున్నది. అందులో కొంత సారాంశం తెలుగులో పిల్లలకు, యువతకు చెప్పాలని ఈ చిన్నపుస్తకం ప్రచురిస్తున్నాను.

450 పేజీల నివేదిక తయారు చేసినప్పుడు కనీసం 18 మంది ఆర్కిటెక్టులు, విద్యార్థులు, ప్రతిఫలాపేక్ష లేకుండా నాతో కలిసి పనిచేశారు. వారి శ్రమ మరువరానిది. అధికారులు, చరిత్రకారులు, నిపుణులు నా ప్రతిపాదనలు పరిశీలించి ఆమోదించారు. ఇది సమగ్రం కాదు, ఇంకా ఎంతో పరిశోధన జరగాలి. పారిస్‌లోని యునెస్కో అధికారులు 'ఆసక్తితో పరిశీలించాం' అని ముఖ్యమంత్రి గారికి జాబు వ్రాసినప్పుడు యునెస్కోలోని మన రాయబారి వ్యక్తిగతంగా నా శ్రమను అభినందిస్తూ వ్రాసినప్పుడు నాకు కొండ ఎక్కినంత సంతోషం కలిగింది.

నన్ను తొలుత గుర్తించి ఆశీర్వదించిన పితృతుల్యులు, డాక్టర్.సి.నారాయణరెడ్డి గారికి నా నమస్సులు. ఇంకా ఎందరో పెద్దల ఆశీస్సులతో జరిగిన ఈ కృషి సఫలీకృతమౌతుందని నా ఆశ.

**వసంతశోభ**

# విషయక్రమం....

# భవనాలు అనేక రకాలు

మనుష్యులకే కాదు, సకల ప్రాణులకు పొట్టకు తిండి ఎంత అవసరమో, ఎండా వాన నుండి తలదాచుకునే గూడుకూడా అంత అవసరమే। ఇతర జీవులవలె మనుష్యులు ఏ చెట్టుపైనో తలదాచుకుని బ్రతుకలేరు కనుక, రకరకాల సామాగ్రితో, నివాసానికి ఇళ్లు తయారు చేసుకుంటారు. నిరుపేద నుంచి, పెద్ద భాగ్యవంతులవరకు తమ దగ్గరున్న డబ్బునుబట్టి నివాసగృహం ఏర్పాటు చేసుకుంటారు. అంతేగాక, తమ హోదా, దర్జా చూపించుకోవడానికి కొందరు, అందంగా, కళాత్మకంగా ఉండాలని కొందరు భవనాలు కట్టుకుంటారు.

దేశాన్నిబట్టి, కాలాన్నిబట్టి, వాతావరణాన్నిబట్టి ఈ నివాస భవనాల నిర్మాణం మారుతూ వుంటుంది. ఉదాహరణకు, మీ పల్లెటూరు వెళితే, పూరిళ్ళు, మండువా లోగిళ్ళు, చెక్కమిద్దెలు కనిపిస్తాయి. హైదరాబాద్‌లాంటి నగరంలో ఆధునికంగా, సకల సౌకర్యాలతో, అంతస్తుల భవనాలు కనిపిస్తాయి. ఎస్కిమోలు చలిదేశాల్లో మంచుగోడలు కట్టుకుంటే, మన దేశంలో అస్సాంలాంటిచోట పర్వతాలపైన తేలికగావుండే చెక్కలతో ఇళ్లు నిర్మిస్తారు. ఎడారి ప్రాంతాలలో చల్లదనానికై మట్టితో కట్టుకుంటారు. వాతావరణంవల్ల కలిగే బాధలనుండి ఇల్లు రక్షణ కల్పిస్తుంది. కేరళ రాష్ట్రంలో వర్షాలు ఎక్కువ. అందుకని వాననీరు జారిపోయేట్లు వాలుగా పెంకులతో పైకప్పు వేస్తారు. చలికాలంలో వెచ్చగానూ, ఎండ వుండేటప్పుడు లోపల చల్లగా, హాయిగా వుండేటట్లు ఇల్లు వుండాలని ప్రతివారూ కోరుకుంటారు.

ఉష్ణదేశాల్లో నీడపట్టున కూర్చుని మసలే ప్రదేశం ఎక్కువ అవసరమనిపిస్తుంది. సముద్రతీర ప్రాంతాలలో చెమ్మవుండడంవల్ల ఆరడానికి గాలి ఎక్కువ ప్రవహించాలి. సౌకర్యాల సంగతి అటుంచి, ఖర్చు సంగతికూడా





ఆలోచించాలి. భవనం విస్తీర్ణం, వాడే **సామ**గ్రిని బట్టి ఖర్చు వుంటుంది. ఇల్లు కట్టడానికి అవసరమయ్యే **సామ**గ్రి ఏమిటి? మనకిప్పుడు వెంటనే గుర్తుకువచ్చేవి ఇటుకలు, సిమెంటు,




ఉక్కు చెక్కలు. కానీ, కొన్నివేల, వందల సంవత్సరాలనుంచి మనుష్యులు ఉపయోగించిన వస్తువులు **వేరు**. సిమెంటు కనుక్కోలేదు. అప్పుడు రవాణా సౌకర్యాలు తక్కువ కనుక అందుబాటులోవుండే వస్తువులతో ఇళ్లు కట్టుకునేవారు. కొండలనుండివచ్చే గ్రానైట్ రాళ్ళు హైదరాబాద్‌లో వాడితే, రాయలసీమ,



పలనాడు ప్రాంతాలలో నాపరాళ్ళు, బండలు ఉపయోగిస్తారు. రాజస్థాన్ కొండలలో లభ్యమయ్యేవి చలువరాళ్ళు, **పొ**రలుగా వుండే ఎర్ర ఇసుకరాయి (రెడ్ శాండ్‌స్టోన్).
**అదేవిధంగా** కాశ్మీర్ అడవులలో చెక్క దొరుకుతుంది. వెచ్చదనమేకాక, కొండచరియలు విరిగిపడినప్పుడు ప్రమాదాన్ని తగ్గించడానికి తేలికగాకూడా వుంటాయి.

ఇలా ప్రాంతాన్నిబట్టి మారుతూ కనిపించే నిర్మాణసా**మ**గ్రికాక ప్రపంచం యావత్తులోనూ అతి సామాన్యంగా వాడుతూ వచ్చినవి ఇటుకలు, ఇసుక, సున్నం, పెంకులు, తలుపులకు చెక్కలు. అయితే ఆయా ప్రాంతాలలో దొరికే మట్టిని **బట్టి**, తయారుచేసేవారి అలవాట్లు, పద్ధతులనుబట్టి వాటి స్వరూపం, నాణ్యత



మారుతూ వస్తుంటాయి.

పిల్లలూ! మీరూ ఒక ఇంటిని చూడగానే ఈ విషయాలన్నీ పరిశీలించాలి. ఇల్లు ఎప్పుడు కట్టారు, అనుసరించిన నమూనా (డిజైన్) ఎటువంటిది, నేల, గోడలు, కప్పులకు వాడిన సామాగ్రి ఏమిటి అనేవి తెలుసుకుంటే సరదాగా వుంటుంది. విజ్ఞానమూ పెరుగుతుంది. పెద్దలను అడిగికూడా ఈ సంగతులు తెలుసుకొనవచ్చును.

నివాసానికై కట్టే ఇళ్ళుకాకుండా, నలుగురూ కలుసుకునే స్థలాలు కొన్ని వుంటాయి. దేవాలయాలు, మసీదులు, చర్చిలువంటి ప్రార్థనాస్థలాలు ముఖ్యంగా చెప్పుకోవాలి. ఒక దేవాలయంలోవున్న భగవంతుడి విగ్రహాన్ని ప్రతిష్ఠచేసిన గర్భగుడి, చుట్టూ ప్రదక్షిణకై బాటలు,





పూజలు, భజనలవంటి కార్యకలాపాలకై మండపాలు, దేవాలయ ప్రాముఖ్యతనుబట్టి గోపురాలు, శిఖరాలు వుండడాన్ని గమనిస్తాము..

మసీదుల్లో విగ్రహారాధన వుండదుగానీ, 'మెహరాబ్' అనే పవిత్రస్థానం, మక్కా దిశగా పశ్చిమాన్ని చూపుతూ వుంటుంది. దాన్ని అనుసరించి మహమ్మదీయులు నమాజు నిర్వర్తిస్తారు. కనుక, వారు కూర్చునే స్థలాలు ప్రాంగణంగా తీర్చిదిద్దుతారు.

మరొక ముఖ్యమైన కట్టడము కోట. పరిపాలనకు, దేశ రక్షణకు ముఖ్యమైన రాజుల కోటలు, గజాశ్వశాలలు, పాకశాలలు, అతి ప్రాచీనకాలంనుంచి, శతాబ్దాల క్రిందటే వుండేవి. చక్రవర్తులు, రాజులు, ధనికులు కట్టించుకున్న సమాధులు అతి గొప్ప కట్టడాలు.

ప్రజల జీవితంలో అనేక కార్యకలా పాలుంటాయి.



# ప్రపంచ వారసత్వం

చదువుకోవడానికి బడులు, పెద్ద విద్యాలయాలు, బసకై సత్రాలు, బజారుల్లో అంగడులు, వైద్యానికై ఆసుపత్రులు, కార్యాలయాలు, గ్రంథాలయాలు, పఠన మందిరాలు - ఇలా ఎన్నో భవంతులు జనుల అవసరాలు తీర్చే విధంగా నిర్మిస్తుంటారు.

ఇరవయ్యో శతాబ్దంలో మనుష్యుల జీవితాల్లో ఊహకు అందని మార్పులు వచ్చాయి. రవాణా సౌకర్యాలు పెరిగాయి.





రైళ్ళు ఆగేందుకు స్టేషన్లు, బస్సులకై షెడ్డులు, విమానాశ్రయాలు, యంత్రాలుంచే పారిశ్రామిక భవనాలు, కంప్యూటర్లగదులు నిర్మాణం చేయవలసివచ్చింది. కళాశాలలు, విశ్వవిద్యాలయాలు, సమావేశ మందిరాలు, బ్యాంకులు, అతి సంపన్నమైన పారిశ్రామిక వాడలు ఎన్నో కట్టించడం మొదలుపెట్టారు. బయటవుండే చలి, వేడినుంచి మనుషులకు రక్షణ కల్పించడం వీటి ముఖ్య ఆశయం కాదు. పెద్దసంఖ్యలో ప్రజలు మసలే సౌకర్యాలకు, ఆయా సంస్థలయొక్క స్థాయికి ఎక్కువ ప్రాముఖ్యత వుంటుందని మనం గమనించాలి.

కట్టడాలు ఎన్ని రకాలుగా వుంటాయో, వుండ వచ్చునో చెప్పుకున్నాము గనుక, ఐదువేల సంవత్సరాల వెనుకనుంచే జరిగిన భవన నిర్మాణం, నాగరికత ఎలా వుండేదో తెలుసుకోవాలి. ఎంత ప్రాచీనకాలంనుంచి వాస్తు, శిల్ప వైభవం వెల్లివిరిసిందో, అది మనకెంత గొప్ప తరగని వారసత్వమో తెలుసుకుందాం।

# చరిత్రలో మహోన్నత నిర్మాణాలు



అన్నిరకాల భవనాలు, కట్టడాలు సుందరంగా కళాత్మకంగా తయారుచేయాలని మనిషికి ఎంతో కోరిక. ఎవ్వరూ కనీ వినీ ఎరుగనటువంటి అద్భుతంగా, శాశ్వతంగా తమ నైపుణ్యం రూపుదిద్దుకోవాలని, యుగయుగాలుగా వాస్తుశిల్పులు, భవన నిర్మాణదారులు ప్రయత్నాలు చేశారు. వారి కలలు నిజరూపం దాల్చి, అప్పటి రాజుల ప్రాపకంకింద, భూమి, ఆకాశం వున్నంత కాలం నిలిచివుంటాయనిపించే పరమాద్భుతమైన కట్టడాలు ప్రపంచంలో కనిపిస్తాయి. వాటిని గురించి తెలుసుకొని స్వయంగా దర్శించి, కళ్ళారా చూస్తే మనిషి ఎంత గొప్పవాడు, తన శ్రమను ఎంత అమరం చేసుకున్నాడు అని ఆశ్చర్యం కలుగుతుంది. క్రీస్తుపూర్వం మూడువేల ఏళ్ళక్రితం, ఈజిప్టులో కట్టిన పిరమిడ్‌లు అత్యద్భుతమైన నిర్మాణాలు.





ఆనాటి ఫరావో అనబడే పరిపాలకులు, తాము చనిపోయాక, పునర్జన్మ ఎత్తుతామని, తమ జీవనానికి కావలసిన వసతులు, సుఖాలు వుండాలని కట్టించుకున్న సమాధులు లేక గోరీలు - ఈ పిరమిడ్‌లు. మరో విశేషం ఏమిటంటే నైలునది పశ్చిమతీరాన కట్టిన ఏడు పిరమిడ్‌లు, మన సప్తర్షిమండలం ఆకారంలో వున్నాయని పరిశోధకులు తెలిపారు.

చర్చిల్లోని ప్రార్థనా సమావేశాలలో మతాధికారి ప్రవచనాలు కూర్చుని వినేందుకు అనువుగా విశాలమైన హాలు, 'ఫుల్ పిట్' వేదిక మొదలైనవి నిర్మిస్తారు. వీటన్నింటిలోని ప్రధాన లక్షణం ఏమిటంటే, భక్తులు ప్రవేశించే ద్వారాలు, సంచరించే ఆవరణ, కూర్చుని పూజలు, ధ్యానం చేసుకునే ప్రదేశాలు నిర్దిష్టమైన పద్ధతిలో, పెద్ద సంఖ్యలో ప్రజల అవసరానికి తగినట్టు వుంటాయి.

'పిరమిడ్'లు ఊహకు అందనంత పెద్ద రాతికట్టడాలు. ఎన్ని భూకంపాలు, ప్రకృతి వైపరీత్యాలు వచ్చినా చెక్కుచెదరకుండా నిలిచాయంటే వాటి అపూర్వలక్షణం తెలుస్తుంది. గీజా దగ్గరవున్న మూడు ముఖ్యమైన పిరమిడ్‌ల గురించి చెప్పాలంటే **ఇవి సుమారు** 480 అడుగుల ఎత్తుతో, ఒక్కొక్క వైపు 756 అడుగుల నిడివి

**కలిగి** ఆక్రమించిన 13 ఎకరాలు ఆక్రమించిన **భారీ నిర్మాణాలు.** దీన్నిబట్టి ఊహించుకోవచ్చును ఇవి 'గ్రేట్ పిరమిడ్'లుగా ఎలా పేరుగాంచాయో! ఇక్కడ మనం ఒక సంగతి గ్రహించాలి. ఏ మహా నిర్మాణమైనా శాశ్వతంగా అందరినీ ఆకర్షించి స్మృతిలో నిలిచిపోవడానికి ముఖ్యమైన లక్షణం ఏమిటి అని విమర్శచేస్తే, వాటిలోని కళారూపం, పొడవు, ఎత్తు, వైశాల్యం, శిల్పవిశేషాలు అన్నీకూడా ఒకదానికొకటి తీసిపోకుండా, సమతూకంలో వుండడం, అన్నిభాగాలూ పొందికగా ఒకదానికొకటి సైజులో, అమరికలో,




**ఎటువంటి** పొరపాటులేకుండా నిర్మాణం కావడం. దీనినే ఆర్డరు అంటారు. గ్రీసుదేశం ప్రపంచానికి అందించిన ఆయానిక్, డోరిక్, కోరింతియన్ ఆర్డరులు, శాశ్వతమైన వారసత్వం అని చెప్పుకోవాలి.



క్రీస్తుపూర్వం మూడువేల నుంచి, ముప్ఫై సంవత్సరాలవరకు గ్రీకులు కట్టిన దేవాలయాలు ఎంతో అద్భుతమైన శైలిలో నిలిచిన నిర్మాణాలు. వీటిలో గుర్తించదగిన విశేషాలు ఏమిటంటే - ఎత్తయిన స్తంభాలు, వాటిపై చెక్కిన అగ్రభాగాలు, ఆపైన అడ్డంగా కట్టిన త్రికోణాకారంలోని 'పెడిమెంట్లు' - ఇవి నిరాడంబరంగా వున్నా ఎంతో అందమైనవి. ఇన్ని శతాబ్దాలుగా అన్ని దేశాలలోనూ వాస్తు శిల్పులు అనుసరిస్తున్న చెదరని, పొల్లుపోని ఒక శిల్పనిర్మాణపద్ధతి అని చెప్పవచ్చును.



గ్రీకు దేవాలయాలలో, ఏథెన్స్‌లోని పార్తనూన్, ఎక్రోపోలీసు జనవాసం 102×228×50 అడుగులు - అంటే 4 : 9 : 2 నిష్పత్తిలో వెడల్పు, పొడవు, ఎత్తు వుంటాయి, ఏవైపు చూచినా! వీసమెత్తు పొరపాటులేని ఈ కళారూపం చుట్టూ స్తంభాల వరుస వుంటుంది. 'పెరిస్టైయిల్ హాలు' అనేది ప్రార్థనామందిరం. శిథిలమైనా, ఈనాటికీ ప్రపంచ ప్రజలుచూచి విభ్రాంతి చెందుతుంటారు.




రోమన్ శిల్పవైభవంలో, ఎక్కువగా నాగరికత కన్పిస్తుంది. క్రీస్తుపూర్వం 300 సంవత్సరంనుంచి క్రీస్తుశకం 365 వరకు విస్తరించిన ఈ నిర్మాణపరంపరలో





ధనవ్యయం, విలాస, వినోదాల ప్రాబల్యం గోచరిస్తాయి. రోమను దేవాలయాలు, రాజభవనాలే కాకుండా వారి వాణిజ్య, విక్రయ స్థలాలు, సభావేదికలు, సమావేశాల విశాలమైదానాలు, స్టేడియం కట్టడాలు, న్యాయవిచారణ జరిపే బాసలిక ధర్మాసనాలు, ధర్మే అనే రోమను ప్రజల స్నానాగారాలు, నాటకశాలలు, వరుసలుగా వుండే గ్యాలరీ సీట్లు, గుండ్రని, గ్రుడ్డు ఆకారాలలో రంగస్థలంగల ఏంపీ థియేటరు, జంతువుల సర్కస్ ప్రదర్శన మైదానాలు, విజయాన్ని ప్రకటించే విజయద్వారాలు, స్తంభాలు,



జలాగారాలు, సరఫరా గొట్టాలు, వంతెనలు - ఇటువంటివి ఎన్నో సృష్టించారు. ముమ్ముందు తరాలు అన్నిదేశాలలోనూ వీటిని అనుకరిస్తూ, ఈనాటికీ నిర్మాణాలు చేస్తున్నారు. ఇందాక చెప్పిన గ్రీకు ఆర్డరులు



మూడింటితోపాటు, మరో రెండు క్రమపద్ధతులను టస్కను, కాంపోజిట్ జోడించి రోమనులు అందించారు.

ఈ సమయంలో క్రైస్తవ మతము ఆవిర్భవించడంతో వాస్తుశిల్పంలో మార్పులు చోటుచేసుకున్నాయి. మతం ప్రచారంకావడం, రాజకీయంగా బైజాంటీన్ సామ్రాజ్యం ఏర్పడడంతో, మహమ్మదీయ వాస్తుశిల్పానికి ప్రధాన లక్షణమైన గుమ్మటశిఖరం ప్రాచుర్యంలోకి వచ్చింది. ఇందులో విశేషమేమిటంటే క్రైస్తవ చర్చి నిర్మాణంలో కూడా ముసల్మానుల 'డోమ్' ఆకృతి ప్రవేశించింది. ఇందుకు ఉదాహరణ - ఆరవ శతాబ్ద ప్రాంతంలోని కాన్‌స్టాంటినోపెలు (ఇప్పటి ఇస్తాన్‌బుల్), సెయింట్ సోఫియా చర్చి, ఇటలీలోని 11వ శతాబ్దపు పీసా క్యాథడ్రెల్ - వీటిని చెప్పుకోవచ్చును.



మహమ్మదీయ వాస్తుశిల్పానికి ప్రధాన లక్షణమైన గుమ్మటశిఖరం

12వ శతాబ్దంనుంచి ఫ్రాన్స్‌లో అనుసరించిన 'గోథిక్' శైలిలోని

వాస్తుశిల్పం విశేషంగా చెప్పుకోవాలి. అతి ఎత్తయిన కట్టడాల నిర్మాణము, పొడవాటి గోడలకు ఆధారంగా నిలిచే బట్రసెస్‌ను నిలిపి, రంగుల గాజుకిటికీలు అమర్చడం మొదలైనవి ఆరంభమైనాయి. సుమారు 16వ శతాబ్దంవరకు, గోథిక్ శైలి **ఐరోపా**లోని వివిధదేశాలలో వ్యాపించింది. పారిస్‌లోని నాటర్‌డామ్, ఇటలీలోని మిలాన్ కాథడ్రిల్, ఇంగ్లండ్‌లోని వెస్ట్ మినిస్టర్ అబ్బే ఎంతో ప్రాముఖ్యత పొందిన నిర్మాణాలు. ఈ కట్టడాలలోని ఇంజనీరింగ్ నైపుణ్యం ప్రత్యేకించి చెప్పుకోవాలి. మనిషి ఎంత ఎత్తయిన భవనం కట్టి చూడగలడు అనేది అప్పటికి నిర్ధారణ అయింది. వందలాది ఏళ్ళు ఇవన్నీ బలంగా నిలబడడమే ఈ గొప్పతనాన్ని చాటిచెపుతోంది.





ఈ సమయంలో ఒక భావ విప్లవం, సాంస్కృతికంగా, సాహిత్య, సంగీత, చిత్ర, కళా, రాజకీయ, సాంకేతిక, పునరుజ్జీవన శకం ఆరంభమైంది. నాటి పరిపాలకుల, మతాధికారుల ఆధిక్యతను ప్రశ్నించసాగారు. అన్ని రంగాల్లోని మేధావులు, చరిత్రకెక్కిన యుగకర్తలు, వాస్తుశిల్పులు ప్రాచీనమైన పద్ధతులే ఉత్తమమైనవని గ్రహించారు. గ్రీకు, రోమను జీవనాన్ని, వారి ప్రతిభను అధ్యయనం చేశారు. స్వయంగా ప్రయాణించి, కళ్ళారాచూసి, అనుకరించడానికి ప్రయత్నాలు ఆరంభించారు. చిత్రకారులు, శిల్పులు కూడా ఈ కృషిలో చేరారు.



దీనినే పునరుజ్జీవన యుగంగా చరిత్రలో వ్రాశారు. ఆల్‌బర్టీ, పెలాడియో, మైకెల్‌ఏంజిలో (ముగ్గురూ ఇటలీ దేశస్తులు), సర్ క్రిస్టోఫెర్ అరెన్ (ఇంగ్లాండ్) వంటివారు ప్రసిద్ధులు. 19వ శతాబ్దంవరకూ కొనసాగిన ఈ కాలంలో కట్టిన చర్చిలు, సెయింట్ పీటర్స్ (రోమ్), సెయింట్ పాల్స్ కెథెడ్రెల్ (లండన్) వాటి కళాత్మకమైన నిర్మాణానికి బ్రహ్మాండమైన పరిమాణానికి, లోపలి భాగాల్లో చిత్రకళా, కుడ్యచిత్రాలు (ఫ్రెస్కో) చెప్పుకోదగిన కొన్ని ఉదాహరణలు మాత్రమే! ఇటువంటివి ఎన్నో వున్నాయి.



సెయింట్ పీటర్స్ (రోమ్)



విల్లా (బంగళా) కంట్రీహోమ్స్, రాజుల భవంతులేకాక, సామాన్య ప్రజలు చక్కని అభిరుచితో కట్టుకున్న వివిధ రకాల భవంతులు చెప్పుకోదగినవి. వీటన్నిటిలో కట్టడంలోని గొప్పతనంకంటే, కళానైపుణ్యం ఎక్కువగా కనిపిస్తుంది. ప్రపంచంలోని ఎన్నో దేశాలలో భారతదేశంతో సహా ఈ ప్రభావం కనిపించసాగింది.

# మనదేశం అతి ప్రాచీనం



ప్రాచీనకాలంనుంచి వున్న పురావస్తు శిల్పాలు, కట్టడాలు, శిలాశాసనాల ఆధారంగా చరిత్ర వ్రాస్తారు. కంటికి కనిపించే ఇవన్నీ నమ్మదగిన విశేషాలు. భారతదేశంలో, మనం చరిత్రలో వెనక్కువెళ్ళి చూడగలిగిన నాగరికత క్రీస్తుపూర్వం మూడువేల ఏళ్ళనాటి 'సింధూలోయ' నాగరికత. దీన్ని గురించి సాంఘికశాస్త్ర పాఠాల్లో మీరు చదివే వుంటారు.

సింధ్ రాష్ట్రంలోని మొహంజొదారో, దక్షిణ పంజాబులోని హరప్పా నగరాల త్రవ్వకాలలో ఇది బయటపడింది. ఆనాటి ప్రజలు నాణ్యతగల సామగ్రి ఉపయోగించి, చిరకాలం గట్టిగా వుండే విధంగా వసతిగృహాలను క్రమపద్ధతిలో నిర్మించుకోవటం ఎంతో ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. ప్రణాళిక ప్రకారం తీర్చిదిద్దిన నగరాలు, వాటిల్లో బాగా కాల్చిన పెద్ద ఇటుకలతో, మట్టితో కట్టిన భవంతులు విశిష్టంగా కనిపిస్తాయి. పెద్ద చెక్కదూలాలు, వాటిపైన గట్టి మట్టికుప్పలు కనిపిస్తాయి. వ్యాపార సావిడులు, కొట్టుగదులు, విశాలమైన ఆవరణల్లో రాజమహలు, ప్రార్థనకై ఏర్పాట్లు - ఇవన్నీ తవ్వకాలలో బయటపడ్డాయి. మనకు వివరాలు ఏమీ తెలియని ఎవరో ఆ ప్రజలు, ఆనాటి గొప్ప సంస్కృతిగల జీవితాన్ని గడిపినట్లు ఈ వాస్తు శిథిలాలవలన రుజువు అవుతోంది.

మన దేశంలో అతి గొప్ప భవన నిర్మాణ కౌశలం సుమారు ఐదువేల ఏళ్ళక్రితం వున్నదని దీనివల్ల అర్థమవుతుంది.





ఆ తర్వాత, క్రీ.పూ.1500 సంవత్సరాల కాలంలో వైదిక సంస్కృతి గురించి పేర్కొంటారు. వేదాలలో వల్లించిన అనేక అరణ్యాలలోని ఆశ్రమ నిర్మాణాలతోపాటు కుటీరాలు నిండిన గ్రామాలు, వాటి వెదురు సరిహద్దులు, గ్రామద్వారాలు అనే ప్రసక్తి కనిపిస్తుంది. క్రీ.పూ.వెయ్యి సంవత్సరాలనాడే వైదిక సంఘాలలో మహావనం అనే పేరుతో చెక్కవడ్రంగం పనుల గురించి ప్రస్తావన వుంది. క్రీ.పూ.500 సంవత్సరాలనాడు మహాగోవింద అనే వాస్తుశిల్పి ఉత్తర భారతదేశంలోని మగధ సామ్రాజ్యకాలంలో రాజధాని నగరాలకు ప్రణాళిక వేశాడని చదువుతాం।



మౌర్యవంశ చక్రవర్తి అశోకుడు బౌద్ధమత సామ్రాజ్యాన్ని ప్రకటించి నిర్మించిన శిలాశాసన స్థూపాలు, ఏకశిలా స్థంభాలు, ఆలయాల పార్శ్వాశాలు కొండలలో తొలచిన మందిరాలు పరిశోధకులకు కనిపించాయి. వాటిలోని శిల్పచాతుర్యం, నిర్మాణంలో నేర్పు ఎన్నదగినవి. 50 అడుగులవరకు కూడా ఎత్తులోవున్న స్థంభాకారాలపైన బౌద్ధమత చిహ్నాలు కనిపిస్తాయి. రాతి సింహాసనాలు, అతి పెద్దవైన గొడుగులు, పాటలీపుత్రంలోని పెద్దహాలు, బీహారులోని గయలో రాతిలో



తొలచిన బౌద్ధ విహారాలు ఆనాటి ప్రతిభను చాటిచెబుతాయి. మన భారత రిపబ్లిక్ చిహ్నమైన సింహస్థూపం సారనాథ్‌లో చూడవచ్చును.



మనదేశ వాస్తు విశేషాలను గురించి చెప్పేటప్పుడు, హిందూ, బౌద్ధ, జైన, ఇస్లాము యుగాలుగా, శైలిగా విభజిస్తారు. కానీ అవి ఆ మతాలకు చెందినవే



'మౌంట్ ఆబూ'లోని దిల్వారా దేవాలయం

అనుకోరాదు. కాలనిర్ణయం చేయడానికి ఏర్పాటుచేసిన సులువైన విభజన అని గ్రహించాలి.

క్రీ.పూ. 4వ శతాబ్దంనుంచి క్రీ.పూ. 9వ శతాబ్దంవరకు బౌద్ధశిల్పం, నిర్మాణాలు విలసిల్లాయి. 'చైత్యాలు' అనబడే సభాసమావేశాల సావిడులు, 'విహారాలు' అనబడే పరివ్రాజక మఠాలు వుండేవి. స్థంభాలు, స్థూపాలుకూడా ప్రసిద్ధిచెందినవే. సారనాథ్, అలహాబాద్, సాంచీలలో, మన అమరావతిలోకూడా స్థూపాలున్నాయి. తక్షశిల, నలందాల విహారాలు పెద్ద ఆవరణలు, చిన్న నివాస మందిరాలు నిండిన 'కాంప్లెక్స్' వంటివి.



ఆరావళి పర్వతాలలోని రాణ్‌పూర్ దేవాలయం

'కార్లీ'లోని చైత్యా 126 అడుగుల పొడవు, 45 అడుగుల వెడల్పులో కొండలో చెక్కిన సమావేశాల హాలు. వీటి స్థంభాలు అష్టకోణాకారంలో వుండి, కింద పూలగుత్తులు, పైన ఏనుగుల ఆకారాలు చెక్కబడి వున్నాయి.

జైన వాస్తుశిల్పం, క్రీ.పూ. 3వ శతాబ్దంనుంచి క్రీ.శ. 17వ శతాబ్దంవరకూ కనిపిస్తుంది. కొండలలో తొలచిన దేవాలయాలలో, గయ దగ్గరవున్న 'లోమస ఋషి గుహ' చెప్పుకోదగినది. 'మౌంట్ ఆబూ'లోని దిల్వారా దేవాలయం తెల్లపాలరాతిలో సున్నితమైన చెక్కడాలతో, స్థంభాలతో అత్యంత సుందరమైన కళాఖండం. ఆరావళి పర్వతాలలోని రాణ్‌పూర్ దేవాలయం ( 1439 ) 200 చదరపు అడుగుల వేదికమీద నిలచి, చుట్టూవున్న 86 గదులపైన అన్ని శిఖరాలు నిర్మించబడిన గొప్ప దర్శనీయస్థలం.



మన జనాభాలో అత్యధికులు హిందువులు కనుక యావత్ భారతదేశంలో విస్తరించిన వాస్తు, శిల్ప, దేవాలయ కళారూపాలు అడుగడుగునా కనిపిస్తాయి. ఏ ఊళ్ళోవున్నా మీరు గుడికి తప్పక వెళుతుంటారు గదా! మన రాష్ట్రంలో ఎంతో ప్రసిద్ధిపొందిన దేవాలయాలు తిరుమల - తిరుపతి వేంకటేశ్వరస్వామి ఆలయం, శ్రీకాళహస్తి, శ్రీశైలం మల్లికార్జునస్వామి, విజయవాడ కనకదుర్గ ఆలయం మొదలైనవి భక్తులను ఆకర్షించడమేకాక, స్థలపురాణాలతో చరిత్రను వెల్లడిస్తుంటాయి. ఆదిశంకరాచార్యులు వంటి మహనీయులు శ్రీశైలాన్ని సందర్శించారు. సుప్రసిద్ధ వాగ్గేయకారుడు ముత్తు స్వామి దీక్షితర్

కాళహస్తీలో కాళహస్తీశ్వరుని స్తుతిస్తూ కీర్తనలు రచించారు.

క్రీ.శ. 350 సంవత్సరం నుంచి చరిత్రలో ఉదహరించిన దేవాలయ వాస్తు నిర్మాణంలో, మధ్యలో గర్భగృహం, ఆపైన శిఖరం (విమానం), చుట్టూరా ఒకటిగాని, ఇంకా ఎక్కువ సంఖ్యలో గానీ మండపాలు, అర్ధమండపం నిర్మిస్తారు. ప్రదక్షిణ పథం, ప్రహారీగోడ, ప్రాకారాలు వాటిలోపల వివిధ దేవతామూర్తులకు విడివిడి ఆలయాలు, ముఖద్వారంపైన గోపురం - ఇవన్నీ కలసిన ఒక సమికృత నిర్మాణ సముదాయంగా, తీర్చిదిద్దేవారు వాస్తుశిల్పులు. ఈ ప్రధాన లక్షణాలతోకూడిన నిర్మాణశైలి 8వ శతాబ్దంనాటికి సమగ్రంగా ఆచరణలోనికి వచ్చింది.



దేశంలోని వివిధ ప్రాంతాలలో సుందర శిల్పనిలయాలుగా, పవిత్రమైన భక్తి ఆరాధనా భావాలను ఉత్తేజపరచే దేవాలయాలు వందలు, వేల సంఖ్యలో వున్నాయి. దేవాలయాలలోని భాగాలను ఆయా రాష్ట్రాలలో వేరు వేరు పేర్లతో పిలుస్తారు. వాటన్నింటినీ గూర్చి చెప్పుకుంటే అదే పెద్ద గ్రంథమవుతుంది. దేవాలయాల నిర్మాణంలో వివిధ శైలులు **గోచరిస్తాయి. కొన్ని సుప్రసిద్ధ ఆలయాల గురించి తెలుసుకుందాం.** బాదామీ చాళుక్యులకాలంనాటి, కర్ణాటక రాష్ట్రంలోని బేళూరు, హళేబీడు దేవాలయాలు సుకుమార శిల్పాలతో భక్తులను, యాత్రికులను కూడా








ఆకర్షిస్తుంటాయి. మన రాష్ట్రంలోని మహబూబ్‌నగర్ జిల్లా ఆలంపురంలో తుంగభద్ర నదీతీరాన నవబ్రహ్మ దేవాలయాలు విశిష్టమైనవి. కొన్ని ఆలయాలు మునిగిపోకుండా అపూర్వమైన పద్ధతిలో పునరుద్ధరించారు.

తమిళనాడులోని ఆలయనగరాలు ఐదు చాలా ప్రసిద్ధమైనవి. కాంచీపురంలోని వరదరాజ, కైలాసనాథ దేవాలయం, కామాక్షి ఆలయం, మధురైలోని మీనాక్షి సుందరేశ్వరాలయం, ఒక ఆవరణలోపల మరొకటివున్న గొప్ప నిర్మాణాలు. మామల్లాపురం, సముద్రతీరాన పల్లవరాజుల రథాలు, దేవాలయాల సముదాయం - ద్రావిడ శైలికి ఉత్కృష్టమైన నిదర్శనాలు.





తంజావూరు బృహదీశ్వరాలయం క్రీ.శ.1000 సం.లో కట్టిన అతిపెద్ద, సుందర, గంభీరమైన నిర్మాణం. శ్రీరంగంలో ఆరు ప్రాకారాలలో అతిపెద్దనుంచి చిన్నవరకు పరిమాణంలో గోపురాలు, శిఖరాలు తీర్చిదిద్దారు.



చిదంబరంలోని నటరాజస్వామి ఆలయంలో వెయ్యి స్థంభాల మండపం కనులపండుగ చేస్తుంటుంది. రామేశ్వరం లోని రామనాథస్వామి దేవాలయంలోని చుట్టూ నడవాల మొత్తం పొడవు 3000 అడుగులు. తిరువణ్ణామలైలోని అరుణాచలేశ్వరాలయం ఎంతో ప్రసిద్ధమైనది.

కేరళ రాష్ట్రంలోని దేవాలయాలు ఒక విలక్షణమైన శైలిలో కనిపిస్తాయి. గోడలు రాతికట్టడాలే కానీ, పైకప్పు పెంకులతో వుండడం విశేషం. ఆడంబరంలేని పద్ధతిలో, దేవాలయం లోపల చిత్రలేఖనాలతో

అందగిస్తుంటుంది. త్రిచూర్‌లోని 'వణుక్కునాథన్' దేవాలయం బాగా ప్రసిద్ధిగాంచింది. దేవాలయం లోపల చిత్రలేఖనాలతో అందగిస్తుంటుంది. త్రిచూర్‌లోని 'వణుక్కునాథన్' దేవాలయం బాగా ప్రసిద్ధిగాంచింది.



ఒరిస్సా రాష్ట్రంలోని భువనేశ్వర్ లో లింగరాజ దేవాలయం 361 / 2 మీటర్ల ఎత్తుతో అతి పెద్దది. పరశురామేశ్వర, ముక్తేశ్వర



దేవాలయాలు స్థంభాలులేని ఓఢ్ర దేవాలయ శైలికి నిదర్శనాలు. మండపాన్ని 'జగమోహన' అని, గర్భగుడిని 'డియుల్', నటమందిరం, భోగమందిరం అనే పేర్లతో చెప్పుంటారు.



పూరీ జగన్నాథస్వామి దేవాలయం వర్ణింపనలవికాని వైభవంగా అలరారుతుంటుంది. కోణార్క్‌లోని సూర్యదేవాలయం అపూర్వమైన చరిత్ర, శిల్పవైభవం, నిర్మాణ వైశాల్యం కలిగివున్న మరువరాని ప్రదేశం.



మధ్యప్రదేశ్‌లోని ఖజురహో, కాందర్య మహాదేవాలయం వెయ్యి సంవత్సరాల నాడు నిర్మించబడిన మందిరాల సముదాయం. జీవం ఉట్టిపడే శిల్పాలు వెయ్యికిపైగా ఈ దేవాలయాలపై చెక్కారు. పెద్ద శిఖరాలను ఆనుకుని చిన్నారి శిఖరాలు వుండడం కూడా ఒక విశేషం. ఉత్తర భారతదేశంలో ఇండో-ఆర్యన్ శైలిలో కలశంగల శిఖరాలు శంఖు ఆకారంలో వుండగా, దక్షిణాదిలోని ద్రావిడ ప్రాంతంలో ఆలయ శిఖరం నిటారుగా



నిర్మాణమవుతోంది. దక్షిణాది దేవాలయాల్లో క్రిందిభాగం నుంచి గోపురం, అడ్డంగా ప్రక్కలకు విస్తరిస్తూ మెట్లుమెట్లుగా వుంటుంది. వీటిపైన దేవతలు, మనుష్యుల శిల్పాకారాలు వేలసంఖ్యలో చెక్కారు



# ఇస్లామిక్ వాస్తుశిల్పం



పన్నెండవ శతాబ్దంలో మనదేశంమీద మహమ్మదీయ దండయాత్రలు, ఆక్రమణ ఆరంభమైనాయి. వారితోపాటు ముస్లిం కట్టడాలు కూడా వెలిశాయి. అప్పటి ఢిల్లీరాజు కుతుబుద్దీన్ ఐబక్, కుతుబ్‌మినార్ కట్టించడం ఒక విశేషం। ఐదు అంతస్తుల అతి ఎత్తయిన స్తంభాకార కట్టడానికి వంపులు తిరిగిన మెట్లున్నాయి. ఎఱ్ర ఇసుకరాళ్ళతో కట్టిన శిఖరాగ్రము (పిరమిడ్) ఆకారంలో కట్టిన ప్రతి అంతస్తుకీ ఒక నమూనా డిజైను వున్నది. ఒకటి నక్షత్రం, మరోటి గుండ్రని వృత్తము, పూల ఆకారంలో మరో అంతస్తు, పూలు - నక్షత్రం కలసిన మరోటి - ఈ విధంగా ఒకటి మార్చి ఒకటి ఉన్నాయి.



ఢిల్లీలోని కువ్వత్ - ఉల్ - ఇస్లామ్ అనే మసీదు దేశంలోనే మొట్టమొదటి మసీదుగా చెబుతారు. ఇదే సమయంలో అల్లా ఉద్దీన్ ఖిల్జి, ఈ 'కుతుబ్' ఆవరణను విస్తరింపజేసి, అలై దర్వాజా అనే అద్భుతమైన మహాద్వారాన్ని కట్టాడు. కుతుబ్‌మినార్‌కు రెట్టింపు కట్టడం లేపాలని ఆయన ఉద్దేశ్యం. అప్పుడే భారతదేశంలో 'డోమ్' ఆకారాలు, ఆర్చిలు వెలిశాయి.



ఖిల్జి వంశ రాజ్యం, గుజరాత్ వరకు వ్యాపించింది. అహమ్మదాబాద్ లోను, జాన్‌పూర్‌లోనూ జామీమసీదులు కట్టించారు. నిజానికి ప్రతి ఊరిలోనూ ఒక ప్రధానమైన జామీ (శుక్రవారం) ప్రార్థనామసీదు వుంటుంది.



ఆ తరువాత చెప్పుకోవలసిన ఘట్టం ఢిల్లీలో తుగ్లక్ వంశరాజ్యంలో 14వ శతాబ్దంలో ఆరంభమైంది. తుగ్లకాబాద్, జహాపనా, ఫిరోజ్‌షాకోట్లావంటి కోటలు నిర్మించారు. దౌలతాబాద్, ఆ తరువాత హైదరాబాద్ దక్కను గోల్కొండ, బీదరువరకు వ్యాపించి, ప్రతిచోటా మసీదులు, కోటలు, సమాధులు కట్టించారు. సమాధుల విషయంలో ఒక సంగతి తెలుసుకోవాలి. రాజులు, అధిక ధనవంతులు, రాచవంశాలవారు తమ సమాధులను తామే బ్రహ్మాండంగా నిర్మింప చేసుకునేవారు.

ఢిల్లీలోని తుగ్లకాబాద్ దగ్గర ఘియాసుద్దీన్ తుగ్లక్ సమాధి నీటిమధ్య ద్వీపంవలే కోటగోడల మధ్య

నిలిచి వుంటుంది. చతురస్రాకారంలో వున్న ఈ సమాధిగోడలు పిరమిడ్‌వలే వాలుగా వుండడం దీని ప్రత్యేకత. ఆపైన గుమ్మటశిఖరం (డోమ్) వుంటుంది.



పదిహేను, పదహారు శతాబ్దాలలో లోధీ వంశం ఢిల్లీలో పరిపాలించిన కాలంలో సమాధులను పెద్ద ఉద్యానవనాలుగా ఏర్పరచి, మసీదుతోసహా ఒక ప్రత్యేకమైన 'కాంప్లెక్స్'గా నిలిపారు. ఢిల్లీలోని లోధీగార్డెన్ ఈనాటికీ సుందరంగా అందరినీ ఆకర్షిస్తుంది. బీహార్‌లో షేర్‌షా సురీ **కూడా** లోధీవంశంవారి పద్ధతిలోనే అష్టకోణాకారంలో (ఆక్టెగన్) సమాధి నిర్మించాడు. అది నీటిమధ్య తేలియాడుతున్నట్లు భ్రమ కలిగించే ఐదు అంతస్తులు, వరండాలతో పెద్ద శిఖరం చుట్టూ ఎనిమిది చిన్న శిఖరాలతో అత్యంత రమణీయంగా వుంటుంది. ఆ తరువాత కాలంలోని మొగలాయి శిల్ప నిర్మాణ వైభవానికి ఇది ఒక నాందిగా అనుకోవచ్చును.



మన దేశంలో ఇస్లామిక్ నిర్మాణ, వాస్తు, శిల్పసౌందర్యం మహోన్నతస్థాయి చేరుకున్నది, మొగలుల కాలంలోనే. ఢిల్లీలోని హుమయూన్ సమాధి ( 1565 ) యమునానది ఒడ్డున మొగలాయి ఉద్యానవనంలో నేటికీ విలసిల్లుతున్నది. **ఇక్కడి** ఊటజలాగారాలు (ఫౌంటెన్స్) **సందర్శకులకు కనువిందు చేస్తాయి**. ఫతేపూర్ సిక్రీలోని జామీమసీదు చుట్టూవున్న 433 అడుగుల పొడవు, 366 అడుగుల వెడల్పుగల ప్రాంగణం ఎంతో పెద్దది. 136 అడుగుల ఎత్తయిన బులంద్ దర్వాజా ఎన్నోమెట్లుగల ఒక మహా నిర్మాణం. ఈ విజయద్వారంపైన చక్కని ఛత్రీలు, భారీ ఆకారాలుగా **మలిచిన** మెట్ల మలుపుల్లో మూలలు అత్యంత ముఖ్యమైనవి. అతి ఎత్తులో ఆర్చిల వరండాలు, చల్లని గాలులతో మైమరపించే ప్రశాంతతకు నిలయాలుగా వుంటాయి.



సలీమ్ చిస్తీ అనే సిద్ధపురుషుని సమాధి పూర్తిగా తెల్లని పాలరాతితో కట్టిన మొదటి నిర్మాణంగా చెబుతారు. ఇది ఎర్రరాతి కట్టడాలమధ్య తళుక్కున మెరిసిపోతుంటుంది. జహంగీరు చక్రవర్తి కాశ్మీరులో నిర్మించిన శాలిమార్ ఉద్యానవనం ప్రపంచ ప్రసిద్ధి పొందినది. నూర్జహాన్ రాణి, తన తండ్రికొరకు నిర్మింపజేసిన సమాధి 'ఇతమద్ దౌలా' చలువరాతిలో సున్నితమైన అల్లకం తెరలతో (జాలీ స్క్రీన్), పొదిగిన విలువైన రత్నాలతో అద్భుతమైన శిల్పకౌశలానికి

తార్కాణంగా నిలిచివుంది. ఈ రాణి గొప్ప కళాదృష్టితో జహంగీరు చక్రవర్తి సమాధికూడా కట్టించింది.



షాజహాన్ చక్రవర్తి ఆగ్రా కోటలో కట్టించిన మోతీ మసీదు (పెరల్ మాస్క్) మూడు గుమ్మట శిఖరాలున్న మనోహరమైన నిర్మాణం. ఢిల్లీ నగరాన్ని నిర్మించిన మహానుభావుడు షాజహాన్.

ఢిల్లీలో అతి ముఖ్యమైన కట్టడం ఎర్రకోట. స్వాతంత్ర్య దినోత్సవంనాడు భారత ప్రధాని ప్రతి ఏడాది జెండా ఎగురవేసి, జాతిని ఉద్దేశించి ప్రసంగిస్తారు. అప్పుడు మనం టీ.వి.లలో 'లాల్ ఖిల్లా' ముందుభాగాన్ని చూస్తూవుంటాం. చారిత్రాత్మకమైన ఎర్రకోటను 1639 - 48 సంవత్సరాల మధ్యకాలంలో షాజహాన్ చక్రవర్తి కట్టించాడు. ఇక్కడ ఒక సంగతి చెప్పుకోవాలి.

ఆనాడు బయటినుండి శత్రువుల దండయాత్రల భయం మొగలాయిలకు అంతగా లేదు కనుక ఆ కోటగోడలు



అంత బలమైనవి కావు. ఒకవైపు పూర్తిగా యమునానది దృశ్యాలు, ఉద్యానవనాలు, విహారస్థలాలు వుంటాయి. ఎర్రకోట విస్తీర్ణం 1600×3200 అడుగులు. కోటలోపల 'దివానేఖాస్' చక్రవర్తికి దగ్గరివారికోసం, 'దివానేఆమ్' సామాన్య ప్రజలకోసం నిర్వహించే దర్బారు స్థలాలు. ఈ కోటలో పువ్వుల ఆర్చిలు వంపులు తిరిగి అందంగా కనిపిస్తుంటాయి. భవంతులన్నీ పాలరాతి నిర్మాణాలే.

ఎర్రకోటకు ప్రక్కగా వున్న చాందినీచౌక్ బజారు మీదుగా వెళితే జామీ మసీదు కనిపిస్తుంది. ఫతేపూర్ సిక్రీ వలే, ఈ మసీదు ఎంతో ఎత్తుమీద 325×325 అడుగుల **మేర** విస్తరించి వుంటుంది. మసీదుకు మూడువైపులా మెట్లు, పశ్చిమదిక్కుగా మూడు గుమ్మటాలున్న పవిత్ర ప్రార్థనాస్థలం **వున్నాయి**. గుమ్మట శిఖరాల ప్రత్యేకత ఏమిటంటే, ఇవి సాఫీగాకాక సన్నని మడత పొరలుగా (బల్బస్ ప్రొఫైల్) **నిర్మించినవి**. మామూలు వాస్తుశిల్పానికి విభిన్నంగా వుంటాయి.



ఇంతకు మునుపు చెప్పుకున్న మొగలాయి కట్టడాలన్నింటిలో ఎర్రరాయి, పాలరాయి చేర్చి ఉపయోగించారు. ప్రపంచానికే అద్భుతమై ఆకర్షిస్తున్న సుందరసౌధం పూర్తి పాలరాతితో నిర్మించిన తాజ్‌మహల్. భరతమాత ముఖచంద్రబింబమా। అనిపించే తాజ్‌మహల్ తన భార్య

## ప్రపంచ వారసత్వం

ముంతాజ్ మహల్ స్మృతికి 1630 - 53 సంవత్సరాలమధ్య షాజహాన్ చక్రవర్తి నిర్మించాడు. ప్రపంచం నలుమూలలనుంచి లక్షలాది జనం వచ్చి చూస్తున్న తాజ్‌మహల్‌ని, మనదేశంలో పుట్టినవారందరూ తప్పక జీవితంలో ఒక్కసారైనా చూచితీరాలి.




తాజ్‌మహల్ ఒక పెద్ద ఉద్యానవనంలో చివరిభాగాన నీలాకాశమే నేపథ్యంగా మెరిసిపోతూ వుంటుంది. ప్రవేశద్వారంలో అడుగుపెట్టగానే, ఫోటోఫ్రేములో అమర్చిన చిత్తరువువలె గుండె ఝల్లుమని పులకరించేట్లు దర్శనమిస్తుంది. దాని ముందున్న నీటికొలనుల్లో సొగసైన ఆకారంలో ప్రతిబింబం కనిపిస్తుంటుంది. చుట్టూ



పచ్చిక, పెద్దచెట్లు ఆహ్లాదంగా కనిపిస్తుంటాయి. ఎడమప్రక్కన ఎర్రరాయితో నిర్మించిన మసీదు, కుడిప్రక్కన 'జవాబ్' అనే పేరుతో అంటే మసీదుకు బదులిస్తున్నట్లుగా మరొక కట్టడం. ఈ రెండు ఎర్రని కట్టడాల మధ్య శ్వేతపద్మంవంటి తాజ్‌మహల్ ప్రేమ, స్మృతికి చిహ్నం.

తాజ్‌మహల్ 22 అడుగుల ఎత్తయిన 315×315తాజ్‌మహల్ 22 అడుగుల ఎత్తయిన 315×315 అడుగుల చదరపు ఆకారంగల అరుగువంటి వేదికమీద



వుంటుంది. పైన శిఖరం కొనవరకు సుమారు 200 అడుగుల ఎత్తులో నిర్మించబడినది. నాలుగువైపులా నాలుగు శిఖరస్థంభాలు (మినరెట్స్) నిలబడి తాజ్‌మహల్‌కు సరిహద్దులుగా చూపరులకు ఒక సమగ్రదృశ్యాన్ని చూపిస్తాయి. తాజ్‌మహల్‌లో ప్రధాన ఆకర్షణ డోమ్. అది గుండ్రని (బల్బస్) ఆకారంలో ఎంతో రమ్యమనోహరంగా వుంటుంది. ప్రధానమైన డోమ్‌కి నాలుగువైపులా చిన్న గుమ్మటాలతో కూడిన 'ఛత్రి'లు, బుజ్జిగా అందాలు ఒలకబోస్తుంటాయి.

భవంతిలో ఒక అష్టభుజాకారంలో సెంట్రల్‌హాల్, నాలుగు మూలలా నాలుగు గదులూ వుంటాయి. ఆ హాలు మధ్యలో సమాధి ఆకృతి (సెనోటాప్) వుంటుంది. ముంతాజ్‌మహల్ అసలు సమాధి క్రింది అంతస్తులో మధ్యగా వుండగా, షాజహాన్ చక్రవర్తి సమాధి మాత్రం కొంచెం ప్రక్కగా వుంటుంది. ఈ రెండు సమాధుల చుట్టూ అష్టకోణాకారంలో ఎంతో రమణీయంగా చలువరాయి పరదా నిర్మించారు.



ఇక్కడ ఒక గొప్ప విశేషం ఏమిటంటే, పెద్దహాలులో నిలబడి మనం తలఎత్తి చూస్తే కనిపించే డోమ్ ఆకారం, మనం బయటనుంచి చూసిన డోమ్‌కాదు. దీనినే 'డబుల్ డోమ్' అంటారు. ఎంతో విస్మయకరంగా రెండింటిమధ్య 120 అడుగుల ఖాళీ వుంటుంది. లోపలిది 80 అడుగుల ఎత్తు మాత్రమే. ఇలా ఎందుకు నిర్మించారంటే, లోపలనుంచి అంత పెద్ద ఎత్తుచూస్తే అది గొట్టంలా కనిపించడమేకాక మనం అతి స్వల్పమైనట్లు భావన కలుగుతుంది. వాస్తుశిల్పంలో, కళాదృష్టి ఎంత ముఖ్యమంటే, లోకంలో మనిషే ప్రధానమైన పాత్ర కనుక అతని చూపు, మనోభావనకు తగిన ప్రాధాన్యతనిస్తూ నిర్మాణాలు జరిపారు మన పూర్వీకులు.

తాజ్‌మహల్‌కు ఉపయోగించిన చలువరాయి రాజస్థాన్‌లోని 'మక్రానా' నుంచి తెచ్చిన శ్రేష్ఠమైన నాణ్యత



కలది. సమాధుల దగ్గరున్న రాతి పరదాకి ఉపయోగించిన పాలరాయి అత్యుత్తమమైనదని చెబుతారు. బయట, లోపల గోడలలో ఎంతో ఆకర్షణీయమైన రంగురంగుల పూలు, కోటలు కట్టారు. ఆ తరువాత ఇవి

విడిపోయి 16వ శతాబ్దంలో ప్రత్యేకమైన వేరువేరు శైలితో నిర్మాణవైభవాన్ని పెంచుకున్నాయి.



అక్బర్ చక్రవర్తి ఆగ్రాకి తన రాజధానిని తరలించిన సంగతి చరిత్రలో చదివే వుంటాము. ఆయన ఆగ్రా ఎర్రకోట, ఫతేపూర్ సిక్రీలో మరో కోట నిర్మించాడు. ఎర్రకోటచుట్టూ కందకాలు, ఎంతో ఆకర్షణీయంగా రెండు ప్రధానద్వారాలు ఈనాటికీ కళకళలాడుతూ దర్శనమిస్తాయి. ద్వారాలపైన ముద్దులొలికే అలంకారాలుగా ఛత్రి (కియోస్క్) కట్టడంవల్ల మామూలు కోటకూడా కళాఖండంగా నిలిచింది.



ఫతేపూర్ సిక్రీ కోట రాచ కుటుంబాలు, సిబ్బంది నివాస భవనాల సముదాయం. నీటికొరతవల్ల కేవలం పది సంవత్సరాలలోనే దానిని వదిలేశారు. ఇందులో దివాన్-ఏ-ఖాస్ చక్రవర్తి సింహాసన మందిరంలో ఒక ఎత్తయిన స్తంభంమీద సింహాసనం నిలిపి, చుట్టూ నాలుగు వంతెనలవంటి దారులు రాజమందిరం మొదటి అంతస్తుకు కలపడం అతి గొప్ప విశేషం! 'పంచమహల్' ఐదు వరుసల మెట్లుగల అంతఃపురం, రాజా బీర్బల్ రాజభవనం చూడదగ్గ సుందర నిర్మాణాలు.

బీజాపూర్‌లో చెప్పుకోవలసినది 'గోల్‌గుంబజ్'. మహమ్మద్ ఆదిల్‌షా సమాధి 1650లో నిర్మించబడింది. పుష్పవృక్షాలు, తీర్చిదిద్దిన కాలిబాటలు, 22 అడుగుల ఎత్తుగల వేదికమీద నిలచిన బ్రహ్మాండమైన కట్టడం, ఒక్కొక్క వైపు 160 అడుగుల పొడవు, గుమ్మట శిఖరం 125 అడుగుల ఎత్తుతో, నేటికీ చెక్కుచెదరని స్థితిలో వున్నది. బయటకు చతురస్రాకారంగా వున్న ఈ సమాధిలోపల అష్టభుజాకారంగా వుండడం గొప్ప విశేషం. ఇందులోకి ఎర్ర ఇసుకరాయి అల్లికల (జాలీ) గోడలలోని అందమైన డిజైన్‌ద్వారా వెలుతురు ప్రసరిస్తుంది. పాలరాయి, ఎర్ర ఇసుకరాయి

విస్తారంగా ఈ నిర్మాణాలలో ఉపయోగించారు.

ప్రపంచం మొత్తాన, అర్ధగోళాకారమైన ఒకే డోమ్ కింద అత్యధిక విస్తీర్ణం వున్న ఉదాహరణ ఇదే. దీని నడిమి కొలత 44 మీటర్లు. ఇక్కడి ఇబ్రహీం ఆదిల్‌షా సమాధికూడా ఒక గొప్ప కట్టడం. 'రౌజా' అనే పేరుతోగల ఈ పెద్ద నిర్మాణం 1620లో జరిగింది. ఇక్కడి మసీదు, సమాధికలసి ఒక వేదికమీద వున్నాయి. వీటి ఆకారం, మలాములోని 'స్టకో' పనితనంగల ప్లాస్టరింగు కళ్ళకు ఇంపు కలిగిస్తాయి. వీటి డిజైను అతి సమగ్రమైనది.



హైదరాబాద్ చారిత్రాత్మకమైన నగరం. ఇక్కడి గోల్కొండ కోట 14వ శతాబ్దంలో కాకతీయుల కాలంలో నిర్మించబడి, 16వ శతాబ్దంలో కుతుబ్‌షాహీ రాజుల చేతుల్లో అభివృద్ధి చెందింది. ఇందులో 7 పెద్ద గోడలున్నాయి. ఒక లోపలి కోట 'బాలాహిస్సార్' అనే రాజభవన ప్రాంగణాలు, బయటికోటకు 8 ద్వారాలువున్న బ్రహ్మాండమైన కట్టడం ఇది. పశ్చిమోత్తర దిక్కున, 'కుతుబ్‌షాహీ'



సమాధులు 20 వున్నాయి. రాచకుటుంబంవారి ఈ సమాధులు పెద్ద పరిమాణంలో, పైన డోమ్‌లతో, క్రింద వేదికలతో కట్టిన అందమైన నిర్మాణాలు. ఒక్కొక్కటీ ఒక్కొక్క రకంగా కట్టిన వీటిల్లో, దశలవారీగా నిర్మాణపద్ధతులు మెరుగుకావడం కనిపిస్తుంది.



హైదరాబాద్ అంటేనే చార్మినార్ నగరంగా ప్రాముఖ్యత వుంది. **నాలుగు** వీధుల **కూడలిలో** 1591లో కట్టిన నాలుగు స్థంభాల (మినార్) గొప్ప కట్టడం ఇది. నాలుగువైపులా ఆర్చిలు అతి పెద్దవిగా, కళాత్మకంగా నిలిచి వుంటాయి. ఒక్కొక్క మినారు 55 మీటర్ల ఎత్తు వున్నది. సున్నితమైన చెక్కడం, అలంకారాలతో నిండిన ఈ 30 మీటర్ల చదరపు ఆకారం మనకెంతో దగ్గరగా వున్నట్లు ఒక భావాన్ని కలిగిస్తుంది. పువ్వులతో నిండిన చిన్న, పెద్ద ఆర్చిలు ఆకర్షణీయంగా పలుకరిస్తుంటాయి. గోడలకు సున్నపు ప్లాస్టరువల్ల ఒక మెరుపు వుండేది కానీ, పొగలు, వాతావరణ కాలుష్యంవల్ల మసకబారింది.



## వలస (కలోనియల్) భవన నిర్మాణ శైలి

ఒక దేశస్తులు మరొక దేశానికి వలసగా వచ్చి ఆక్రమించుకున్నప్పుడు, ఆ తరువాత పరిపాలకులుగా మారినప్పుడు తమ భాష, కళలు, అలవాట్లు ఆ రెండో దేశంలో పెద్ద ఎత్తున ప్రవేశపెట్టడం మనం చరిత్రలో చూస్తాం. మనదేశంలోకి ఐరోపా దేశస్తులు 17వ శతాబ్దంలో ప్రవేశించారు. భారతీయ వాస్తు, శిల్పకళా నిర్మాణాలు క్రమేపీ కలగాపులగమై, కొత్త శైలి ప్రభావానికి లోనుకావడం ఆరంభమైనది. ఈ మిశ్రమ వాస్తుశిల్పానికి ఒక ఉదాహరణ - అప్పటివరకు మండువాలుగా వుండే ఇల్లు, చిన్న తోటలమధ్య బంగళాల పద్ధతిలోకి మారసాగింది. అంతేకాక, తమ దేశస్తులు నివసించడానికి 18వ శతాబ్దంలో బ్రిటిష్‌వారు భవనాలు కట్టడం ఆరంభించారు. కలకత్తాలో వైస్రాయ్‌కోసం గవర్నమెంట్ హౌస్,



మద్రాసులో ఫోర్ట్ సెయింట్ జార్జి, గోవాలో చర్చిలు వంటివి నిర్మించారు. అదే పద్ధతిలో దేశమంతటా అంటే, కలకత్తాలోని సెయింట్ జాన్స్, ఢిల్లీలోని సెయింట్ జేమ్స్‌వంటి అతి పెద్దవి, ప్రసిద్ధములైన చర్చిలు నిర్మించారు.



లక్నో (18వ శతాబ్దం), హైదరాబాద్ (1906)లలో బ్రిటిష్ రెసిడెన్సీ భవనాలు తమ ప్రతినిధులకోసం కట్టించారు. ఇవన్నీకూడా మొత్తం యూరోపియన్ శైలిలో



అంటే, రినైజా పద్ధతిలో వున్నాయి. వీటిని చూచి, స్వదేశీయులు కూడా అదే శైలిని అనుకరించడం ఆరంభించారు.

నవాబుల బంగళాలు, రాజభవనాలు ఈ పద్ధతిలో నిర్మించినవే. ఉదాహరణకు - హైదరాబాద్‌లోని నిజాముయొక్క ఫలక్‌నుమా ప్యాలెస్, 19వ శతాబ్దంలో చార్మినార్ వెనకాల ఖిల్వర్ ప్యాలెస్, ఖుర్షీద్‌ఝా బరాదారి ఈ విధంగా కట్టించినవే. ఇవి యూరోపియన్ వాస్తుశిల్పానికి నమూనాలే. మొత్తంగాకాక భారతీయశైలిలో బాహ్యంగా కనిపించే అంశాలు,



**ప్లాన్** యూరోపియన్ లక్షణాలతో **మిశ్రమ పద్ధతి కనిపిస్తుంది.** ఉదాహరణకు 1845లో నిర్మించిన 'మల్వాలా ప్యాలెస్', నిజాం ప్రభుత్వ రెవెన్యూ మంత్రి నివాసం, 1890నాటి మహబూబ్ మాన్షన్ చెప్పుకోవచ్చును.



మల్వాలా ప్యాలెస్‌లో మధ్యలో ప్రాంగణం, ఆవరణ, వరండాలు ఇంటిలోపలకు తెరచుకుంటాయి. మహమ్మదీయ పద్ధతిలో బయటకు కిటికీలు వుండవు. ఇవి అతి సుందరమైన చెక్కల నిర్మాణాలు. బయటివైపు 'క్లాసికల్' సంప్రదాయమైన, అలంకారమైన పెద్ద ఆర్చితో చూడగానే యూరోపియన్ భవంతి అనిపిస్తుంది.

బ్రిటిష్ సామ్రాజ్య స్థాపన, ఆక్రమణతో సైన్య నివేశనములైన

కంటోన్మెంటులు, నాణేలు ముద్రించే మింట్‌కాంపౌండ్‌లు వెలిశాయి. 19వ శతాబ్దంలో పారిశ్రామిక విప్లవం, రైళ్ళరాక ముఖ్యంగా చెప్పుకోదగిన మార్పులు. అనేక ప్రభుత్వ భవనాలు అవసరమైనాయి. ఉక్కు, సిమెంటు కనుగొన్నందువల్ల భవంతులు పెద్దవిగా, అనేక అంతస్తులలో ఏర్పరిచారు. ఇంజనీరింగ్ పనులు ఎక్కువైనాయి. వెడల్పు, నిడివిగల పెద్ద భవంతులు విక్టోరియన్ పద్ధతిలో నిర్మాణమైనాయి. ముంబాయి, అంటే అప్పటి బొంబాయిలోని విక్టోరియా టెర్మినస్ రైల్వే స్టేషన్, హైదరాబాద్‌లోని కాచిగూడ రైల్వే స్టేషన్ ఉదాహరణలుగా చెప్పవచ్చును.





ఈ శతాబ్దం ఆరంభంలో మాత్రం ఆ పెద్దభవంతులకే భారతీయ లక్షణాలైన, అంటే, మొగలాయి ఛత్రి, పూలు, లతల అలంకారాలు తీర్చిదిద్దసాగారు. కలకత్తాలోని విక్టోరియా మెమోరియల్, జైపూర్‌లోని ఆల్బర్ట్ హాల్, బొంబాయిలోని అనేక ప్రభుత్వ భవనాలు వీటికి తార్కాణాలు.



కొత్తఢిల్లీ నిర్మాణం 1912లో ఆరంభమైంది. 'ఎడ్విన్ లాటియన్' అనే బ్రిటిష్ ఆర్కిటెక్ట్, నగరం ప్లాన్ తయారుచేసి, 'హెర్బర్ట్ బేకర్' అనే మరో ఆర్కిటెక్ట్‌తో కలసి పార్లమెంటు, రాష్ట్రపతి భవనం, సెక్రటేరియట్, ఇండియా గేటు కట్టించారు. ఇండియాగేటునుంచి దృష్టిసారిస్తే అత్యంత మనోహరంగా, హుందాగా కనిపించే బృహత్తర దృశ్యం చూడవలసిందే కానీ వర్ణింపనలవికాదు. వీటన్నింటిలో అతి చిన్న వివరాలవరకు ఊహించి, ప్లాన్‌చేసిన తీరు శ్లాఘనీయం.

మరొక విశేషం ఏమిటంటే ఇండియాగేటు చుట్టూ అప్పటి సంస్థానాధీశుల, రాజుల భవనాలు నిర్మించారు. అవి పాటియాలా హౌస్, జైపూర్ హౌస్, బికనీర్ హౌస్ మొదలైనవి. వీటిలో హైదరాబాద్ హౌస్, ఎడ్విన్ లాటియన్ స్వయంగా రూపుదిద్దిన ఎంతో రమణీయమైన భవనం. వీటన్నింటిలో రోడ్డుకు

ఎదురుగా పెద్ద గుమ్మటశిఖరం, చుట్టూ విశాలమైన వరండాలు, అతి పెద్ద ప్రాసాదాలు కనిపిస్తుంటాయి.



వన హైదరాబాద్ నగరంలో, 'భారతరత్న' మోక్షగుండం విశ్వేశ్వరయ్యగారిని పిలిపించి, ప్లానుకై సలహాలు పొందారు. విక్టోరియన్ పరిమాణంలో, అతి పెద్ద డోములుగల ఐదు అంతస్తుల భవంతులు, మొగలు



ఛత్రీలుగల అసెంబ్లీ, ఎంతో పెద్దదైన ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైకోర్టు, ఉస్మానియా ఆసుపత్రి, స్టేట్ సెంట్రల్ లైబ్రరీవంటి గొప్ప కట్టడాలు నిర్మించారు. వీటిలో ఆర్ట్స్ కాలేజీ, హైకోర్టువంటివి పూర్తి గ్రానైటు నిర్మాణాలు. ఉస్మానియా ఆసుపత్రి, అసెంబ్లీ భవంతులు ఇటుక, సున్నంతో లైమ్‌ప్లాస్టర్ సౌధాలు. ఇవి భారతీయశైలి అని అనలేము, పూర్తి బ్రిటిష్ శైలీ కాదు. అందుకే వీటిని వలస వాస్తుశిల్ప పద్ధతి (కలోనియల్ ఆర్కిటెక్చర్) అనే పేరున పిలుస్తారు.

అతి గొప్ప వారసత్వం। దీన్ని ఎందుకు కాపాడుకోవాలి?

ఇంతవరకు మనం మహా భవనాలు, ప్రసిద్ధమైన కట్టడాలు, చరిత్రలో నిలచిన నిర్మాణాల గురించి కొంత తెలుసుకున్నాం. ఈ సువిశాల భారతదేశం యుగయుగాల చరిత్ర కలిగివుంది. నాగరికత లెక్కలేనన్ని రూపాలలో వృద్ధి చెందింది. రాజులు, రాజ్యాలు, మత, సాంఘిక రంగాలలో మహామహులు మన సంస్కృతిని పెంచారు. తరతరాలకు దారిచూపే శాశ్వతమైన విలువలను మనకు అందించారు. మరి వీటిని కాపాడుకోకపోతే మనకు ఎంత నష్టం।

కాపురముండే ఇల్లుకానీ, మరో కట్టడంకానీ కేవలం చుట్టూ నాలుగు గోడలు, మధ్య ఇంత స్థలం, పైన ఒక కప్పుకాదు గదా। జీవితం హాయిగా వుండేందుకు భవంతులలో సౌకర్యాలు నిర్మిస్తారు. మీకు ఆసంగతి ఇంతకు ముందు చెప్పిన కోటలు, దేవాలయాలు, విద్యాలయాలు మొదలైనవాటి ప్రత్యేక లక్షణాలనుబట్టి అర్థమై వుంటుంది.

అవసరాలుకూడా కాలాన్నిబట్టి మారుతుంటాయి. మాటవరసకి ఈనాటి ఇంట్లో టి.వి., రిఫ్రిజిరేటర్లు, బయట కార్లు, స్కూటర్లు పెట్టుకునేందుకు వసతి కావాలి. పిల్లలు చదువుకునేందుకు, పెద్దలు పూజ చేసుకోవడానికి



గదులు కావాలి. ఇంటికి ఎవరైనా వస్తే మర్యాద చేయడానికి ముందు డ్రాయింగ్‌రూమ్ వగైరా వుండాలనుకుంటున్నాం. వంటింట్లో గ్యాస్‌స్టవ్‌లకు గట్లు కావాలి.

ఇదే సూత్రం ప్రాచీనమైన కట్టడాలకు వర్తిస్తుంది. ఆనాటి రక్షణ, రాచరికం, మతారాధనవంటి అవసరాలనుబట్టి ఆయా భవనాలు నిర్మించారు. ఆనాడు నమ్మిన వాస్తు, శిల్పశాస్త్రాలకు అనుగుణంగా, తమ కళాభిరుచిని జోడించి, మరపురాని కావ్యాలు రాతిలో రచించారని చెప్పాలి.

అందుకై కేవలం ధనం ఖర్చుపెట్టడమేకాదు మేధావులు తమ శక్తిని, ఊహను ధారపోశారు. అమెరికావంటి దేశం కన్ను విప్పనినాడే ఇంజనీరింగ్ మహాద్భుతాలను సాధించారు. తమ జీవితకాలం ఒక్కొక్క నిర్మాణానికి అంకితం చేసిన శిల్పులు, వాస్తు కళాకారులు వున్నారు. వారి శ్రమ వృధాపోవచ్చునా?

ఏ శతాబ్దంలో ఏ ప్రజలు వారి పరిపాలకులు ఎలా జీవించారు? అని తెలుసుకోవడానికి ఈ కట్టడాలు ఆధారంగా నిలుస్తున్నాయి. అప్పటివారి వేషభాషలు, వినోద విలాసాలను గురించి మనకు పూర్తిగా, అంత స్పష్టంగా ఎలాగూ తెలియదు. కానీ, శాశ్వతమైన ఈ రాళ్ళలో చరిత్ర దాగివున్నది. భారీ ఎత్తున నిర్మించిన సినిమాలలో వీటిని చిత్రించడం మనం చూస్తుంటాం. ఈ కట్టడాలను రక్షించుకోకపోతే మనకు మిగిలేది ఏమిటి?





# యునెస్కో - ప్రపంచ వారసత్వ సంపద

వారసత్వ సంపద అంటే మనకు తాత ముత్తాతల నించి సంక్రమించిన ఆస్తిపాస్తులు. వాటిని గురించి మనం గొప్పగా చెప్పుకుంటాం. ప్రాణప్రదంగా చూసుకుంటాం. అలాగే ప్రపంచ వారసత్వ సంపద అంటే ఈ ప్రపంచంలో వున్న వారందరికీ తరతరాలుగా సంక్రమించిన ఆస్తి అన్నమాట. ఏ ఒక్కరికో ఏ ఒక్క దేశానికో కాదు సమస్త మానవాళికి చెందిన అనమానమైన విలువకలిగిన ఆస్తి అది. సాంస్కృతిక, సహజ వారసత్వ సంపద.

మరి కుటుంబాలలో అంటే ఏవో చిన్న చిన్న ఆస్తులు, ఇళ్ళువాకిళ్లు నగలు నాణ్యాలు వంటివి వుంటాయి. కానీ ప్రపంచ సంపద అంటే అల్లా కాదు. పెద్దపెద్ద విస్తీర్ణాలలో చారిత్రక ప్రాధాన్యం గల పురాతన భవనాలు, కట్టడాలు, రాజప్రాసాదాలు దేవాలయాలు, ఉద్యానవనాలు అడవులు గుహలు- వంటివి అన్నీ వుంటాయి. అంతటి విలువ కలిగిన సంపదను అపురూపంగా చూసుకోవాలి. భావితరాల కోసం పదిల పరచాలి. కానీ ఇది సామాన్య మానవుల వల్ల కాగల పనికాదు. అందుచేతనే ఈ బాధ్యతను ఆయా ప్రభుత్వాలు, అంతర్జాతీయ సంస్థలు స్వీకరిస్తాయి.

ఐక్యరాజ్యసమితి విద్యాశాస్త్ర సాంస్కృతిక, సంస్థ- యునెస్కో- అధీనంలో ఈ కార్యక్రమం ఉంటుంధీ. కార్యక్రమం కింద ప్రపంచ వారసత్వ సంపదను గుర్తించి, పరిరక్షించి పదిలపరుస్తారు. యునెస్కో 1972లో ఇందుకు సంబంధించి అంతర్జాతీయంగా ఒక ఒప్పందాన్ని ఏర్పాటు చేసింది.

ఈ ఒప్పందాన్ని ప్రపంచ సాంస్కృతిక,సహజ సంపద పరిరక్షణకు చెందిన ఈ మహాసభలో ఆమెదించారు. సభ్యదేశాలన్నీ ప్రపంచ వారసత్వ సంపదను కాపాడవలసి వుంటుంది.

## అసలు ఈ సంపదకు గుర్తింపు రావటం ఎల్లాగ?

అంటే ఆయాదేశాలు తమదేశంలోని ప్రాంతాలను గుర్తించి యునెస్కో నియమించిన సంబంధిత అంతర్జాతీయ సంస్థకు పంపుకోవాలి. ప్రతిఏటా ఒక నియమిత సమయం వుంటుంది. అసమయంలోగా ప్రభుత్వాలు జాబితాను పంపాలి. అందిన ప్రతిపాదనలను ఒకదాని తర్వాత ఒకటిగా సంస్థలు పరిశీలిస్తాయి. తనిఖీలు చేస్తాయి. ఆ ప్రాంతాలను సందర్శిస్తాయి. యునెస్కో విధించిన ప్రమాణాలు నియమ నిబంధనలకు అనుగుణంగా వున్నాయో లేదో డేగకన్నుతో చూస్తాయి. కాచివడబోసిన ప్రతిపాదనలు చిట్టచివరకు యునెస్కో వద్దకు చేరుతాయి. అప్పుడు యునెస్కో రంగంలోకి దిగుతుంది. తాను సంతృప్తి చెందిన వాటికి ప్రపంచ వారసత్వ సంపద హోదా కల్పిస్తుంది. ఇదంతా ఒక పెద్ద తతంగం. దాదాపు ఏడాదిన్నర కాలం పడుతుంది. అయితే ఈ గుర్తింపు రావటానికి ముందుగా చొరవతీసుకోవలసింది సంబంధిత దేశ ప్రభుత్వాలే.

ఇక ఒకసారి ప్రపంచ వారసత్వ సంపద హోదా వచ్చిందంటే దానికి వెయ్యికళ్లు కాపలాకాస్తాయి. వాటికి ఏ మాత్రం ప్రమాదం కలిగినా, అంతర్జాతీయ సమాజం చూస్తూ ఊరుకోదు. యునెస్కో నిపుణుల సహాయంతో ప్రపంచ వారసత్వ సంఘం, ఆయాదేశ ప్రభుత్వాలు ఇతర భాగస్వాములు కలిసి వాటి పరిరక్షణకు పరిష్కారం కనిపెడతాయి. చర్యలు తీసుకుంటాయి. ధనసహాయం చేస్తాయి. ఇప్పుడు అటువంటి కొన్ని సందర్భాలు చూద్దాం.



ఈజిప్టులోని గిజాపిరమిడ్లకు 1995లో ముప్పు ఏర్పడింది. రాజధాని కైరో సమీపంలో జాతీయరహదారి ప్రాజెక్టు చేపట్టారు. ఈ నిర్మాణం వల్ల పిరమిడ్లు దెబ్బతినే ప్రమాదం వుంది. వెంటనే అంతా అప్రమత్తం అయ్యారు, రంగంలోకి దిగారు. ఈజిప్టు ప్రభుత్వంతో సంప్రదింపులు జరిపారు. ప్రాజెక్టు నిర్మాణానికి ప్రత్యామ్నాయ మార్గాలు సూచించారు. దీనితో వివాదాస్పదమైన ఈ ప్రాజెక్టు నిలిచిపోయింది. పిరమిడ్లు బతికిపోయాయి.

ఇది 1990లలో నేపాల్‌లో జరిగిన సంఘటన. రాయల్ చిత్‌వన్ జాతీయ పార్కులో రప్తినది మళ్ళింపు ప్రాజెక్టు మొదలుపెట్టారు. ఈ పార్కు ఒకే కొమ్మువున్న ఖడ్గమృగాలకు నిలయం. ఇవి అరుదైన జంతువులు. ప్రాజెక్టు వల్ల ఖడ్గమృగాలు అంతరించే ప్రమాదం ఏర్పడుతుంది. అందుచేత ప్రపంచవారసత్వ పరిరక్షణ సంఘం పథకానికి అభ్యంతరం తెలిపింది. దీనితో నేపాల్ ప్రభుత్వం, ఆసియా అభివృద్ధి బ్యాంకు దిగిరాక తప్పలేదు. ప్రాజెక్టు నిర్మాణం నిలిపివేశారు.

మరోసారి గ్రీసుదేశంలో ఏం జరిగిందంటే డెల్ఫీలో అల్యూమినియం కర్మాగారం నిర్మించాలని ప్రభుత్వం తలపెట్టింది. అయితే అదేసమయంలో అక్కడ వున్న పురాతత్వ స్థలాన్ని ప్రపంచ వారసత్వ సంపదగా గుర్తింపుకోసం పంపారు. రెండూ ఒకచోట కుదరవనీ అదో ఇదో తేల్చుకోవాలనీ యునెస్కో అనడంతో గ్రీకు ప్రభుత్వం కర్మాగార నిర్మాణానికి వేరే స్థలాన్ని చూడవలసి వచ్చింది. ఆ తర్వాత ఆ ప్రాంతానికి గుర్తింపు లభించింది.

అలాగే మెక్సికోలోని తిమింగలాల సంరక్షిత ప్రాంతం, కెన్యాలోని జాతీయ అడవులు, కెన్యాపర్వత జాతీయ పార్కు చిక్కుల్లో పడినప్పుడు ప్రపంచ వారసత్వ కమిటీ జోక్యం చేసుకుంది. వాటికి ముప్పు తప్పింది.

మరికొన్ని సందర్భాలలో ఇంకో విధంగా జరుగుతుంది. వారసత్వ సంపదను అపాయంలో పడ్డ సంపద జాబితాలో చేరుస్తారు. మళ్ళీవాటి హోదా వాటికి లభించాలంటే వాటి పరిరక్షణకు సరైన చర్యలు తీసుకోవాలి. ఆ చర్యలతో యునెస్కో సంతృప్తి చెందాలి.

కంబోడియాలోని ఆంగ్‌కొర్ పురాతత్వ పార్కు ప్రాంతాన్ని 2004లో, క్రొయేషియాలోని దుబ్రోవ్‌నిక్ పాతనగరాన్ని 1998లో, పోలండులోని క్రాకో సమీపంలో వీలిజ్‌గా ఉప్పుకొటారులను 1998లోనూ ఈ జాబితా నుండి తొలగించి మళ్ళీ ప్రపంచ వారసత్వ సంపదగా హోదా కల్పించారు.

నగరాలకు నగరాలనే ప్రపంచ వారసత్వ నగరాలుగా యునెస్కో ప్రకటించింది. 68దేశాల్లోని 195 నగరాలకు ఈ గుర్తింపు వుంది. ఆసియాఖండంలో జపాన్‌లో-4, నేపాల్, చైనా దేశాల్లో మూడేసి, వియత్నాం-శ్రీలంకల్లో -2 చొప్పున, లావోస్‌లో-1 మొత్తం 15నగరాలు ప్రపంచ వారసత్వ నగరాలు. కానీ భారతదేశంలో ఒక్కటి కూడా లేదు.

కాగా ప్రపంచవ్యాప్తంగా 125 దేశాల్లోని 730 స్థలాలకు యునెస్కో గుర్తింపు నిచ్చింది. మనదేశంలో 30 వున్నాయి. తాజ్‌మహల్, అజంతాఎల్లోరాగుహలు, బుద్ధగయలోని మహాబోధి ఆలయం, కాజిరంగ జాతీయ పార్కు, నందాదేవి జాతీయ పార్కు మొదలైనవి వివిధ అంశాల కింద ప్రపంచ వారసత్వ సంపదగా గుర్తింపు పొందాయి. కానీ ఆంధ్రప్రదేశ్‌లో మాత్రం ఒక్కటి కూడా లేదు.

# ప్రపంచ వారసత్వ ప్రదేశాలు (వరల్డ్ హెరిటేజ్ సైట్స్)

**విశ్వజనీనమైన (2005) వారసత్వపు విలువ కలిగి, ఎంపిక చేసిన సాంస్కృతిక, ప్రకృతి సహజమైన ప్రదేశాలు ఎనిమిదివందలపన్నెండింటిని వరల్డ్‌హెరిటేజ్ కమిటీ గుర్తించింది. వీటిలో 628 సాంస్కృతిక సంపదకు, 160 ప్రకృతి సహజమైన విలక్షణతకు, 24 మిశ్రమమైన విలువ కలిగినవి. ఇవి 137 దేశాలలో వున్నాయి. 2005వ సంవత్సరంలో ప్రకటించిన లిస్టులో 29 మన భారతదేశంలో వున్నాయి. వీటిలో ఒక్కటీ మన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో లేదు.**



**ఆగ్రాకోట: ఉత్తరప్రదేశ్, ఆగ్రాజిల్లా.**

**ప్రపంచ వారసత్వ స్థలంగా ప్రకటించిన సం. 1983:**

ఆగ్రా ఎర్రకోట ప్రసిద్ధి చెందినది. యీ చారిత్రక మొగలాయి కట్టడం 16వ శతాబ్దం నాటిది. తాజ్ మహల్‌కు దగ్గరగా ఉంది. అత్యంత దుర్గమైన ఈ కోట ఎర్ర ఇసుకరాయి కట్టడము. మొగలాయి చక్రవర్తుల రాచనగరంలో రెండున్నర కిలోమీటర్ల విస్తీర్ణమున్న గోడల లోపల అద్భుతమైన దేవతలను తలపించే దివ్యభవనాలున్నాయి. వీటిల్లో షాజహాన్ నిర్మింపచేసిన జహంగీర్ భవనం, ఖాస్‌మహల్ ప్రజల దర్శనానికై దివానేఖాస్ వంటి విశాలమైన మందిరాలు, అత్యంత సుందరమైన రెండు మసీదులు వున్నాయి.

**అజంతాగుహలు: ఔరంగబాదు జిల్లా, మహారాష్ట్ర. (1983)**

అజంతాలోని తొలినాటి బౌద్ధ చారిత్రత్మక గుహలు క్రీ.పూ రెండవ, ఒకటవ శతాబ్దాలనాటివి. తొలుత నుంచి వున్న సహజసముదాయానికి 5,6 శతాబ్దాల గుప్తుల కాలంలో, ఎన్నో విధాల అలంకృతములైన మరిన్ని గుహలను చేర్చారు. బౌద్ధమతానికి సంబంధించిన కళకు ప్రతీకలైన అజంతాలోని శిల్పాలు, చిత్రాలు, కళాత్మకత మీద చెప్పుకోదగిన ప్రభావాన్ని చూపించాయి.



**భీమ్‌బేట్కారాతి రక్షణశిలలు (షెల్టరులు) మధ్యప్రదేశ్, (2003)**



భారత పీఠభూమి క్రింద భాగంలోని దక్షిణపు అంచువైపు వున్న వింధ్యపర్వతాల క్రింద సానుగుల పైన వున్నాయి. బ్రహ్మాండమైన ఇసుకరాయి గుట్టల మధ్య దట్టమైన అడవులపైన సహజమైన రాతి రక్షణ మందిరాలు ఐదున్నాయి.

**అమరమైన చోళదేవలయాలు :**



ఇవి 1987లోనూ 2004లో కూడా ప్రపంచ వారసత్వ సంపదగా ప్రకటించారు.

వీటిలో 1987వ సంవత్సరంలో తంజావూరులోని 11వ శతాబ్దపు బృహదీశ్వరాలయానికి గుర్తింపు నివ్వగా 2004లో 11-12 శతాబ్దాల మహనీయమైన రెండు చోళ దేవాలయాలను ఈ జాబితాలో చేర్చారు. చోళ రాజులు దక్షిణ భారతదేశంలోనూ సమీపంలో వున్న ద్వీపాలలోనూ విస్తరించి వున్న ఈ దేవాలయాలను నిర్మించారు. ఇప్పుడు బృహదీశ్వరాలయంతో పాటుగా గంగైకొండ చోళీశ్వరం, ఐరావతేశ్వర ఆలయాలు చేరివున్నాయి. 1035వ సంవత్సరంలో గంగైకొండ చోళీశ్వరం నిర్మాణాన్ని రాజేంద్ర 1 పూర్తి చేశాడు. దేవాలయంలోని 53 మీటర్ల విమాన గోపురం, విస్తరించిన మూలలు, సొగసైన పై ఒంపులు- నిటారుగా వున్న తంజావూరు ఆలయ గోపురానికి విభిన్నంగా వుంటాయి. లోపల వున్న అందమైన కంచులోహ సుందర శిల్పాలను కాపలా కాస్తున్నట్టుగా ఆరుజతల బ్రహ్మాండమైన ఏకశిల ద్వారపాలక విగ్రహాలు వుంటాయి. దారాసురంలో రెండవ రాజరాజు నిర్మించిన ఐరావతేశ్వర దేవాలయ సముదాయంలో 24మీటర్ల విమానగోపురం, శివుని రాతి విగ్రహం వున్నాయి. వాస్తు శిల్పంలో, శిల్పకళలో, చిత్రకళలో, కంచులోహపోతలలో చోళుల అద్భుతమైన విజయపరంపరకు దృష్టాంతంగా నిలుస్తాయి.



## గోవా చర్చిలు - కాన్వెంట్లు : గోవారాష్ట్రం (1986)



పోర్చుగల్ ఇండీస్ వారి పూర్వపు రాజధాని గోవా. గోవాలోని చర్చిలు, కాన్వెంటులలో సెయింట్ ఫ్రాన్సిస్‌జేవియర్ సమాధి వున్న జామ్‌జీసస్ చర్చి ముఖ్యమైనది. ఇది ఆసియాఖండంలో క్రైస్తవమత స్థాపనను సూచిస్తుంది. ఆసియాదేశాల్లో క్రైస్తవ మత సంస్థలను స్థాపించి మాన్యులైన్, మ్యానెరిస్ట్, బరోకే కళల వ్యాప్తికి ఈ చారిత్రక కట్టడాలు దోహదం చేశాయి.



## ఛత్రపతి శివాజీ టర్మినస్ (విక్టోరియా టర్మినస్): ముంబాయి, మహారాష్ట్ర. (2004)



. భారతదేశంలో విక్టోరియన్ గోథిక్ పునరుద్ధరణ శిల్పవైభవాన్ని సంప్రదాయమైన భారతీయ వాస్తు శిల్ప విశేషాలతో సమ్మిళితం చేసిన సుప్రసిద్ధ కట్టడం. బ్రిటిష్ వాస్తుశిల్పి & ఎఫ్.డబ్ల్యూ. స్టీవెన్స్ రూపకల్పన చేసిన ఈకట్టడం ముంబాయి నగరాన్ని గోథిక్ శైలికి చిహ్నంగా నిలిచింది. ప్రధానమైన అంతర్జాతీయ వాణిజ్యరేవుగా మన దేశానికి గుర్తింపు తెచ్చింది. 1878లో ప్రారంభించిన ఈ నిర్మాణం పదేళ్ళపాటు సాగింది. ఇక్కడి రాతి గుమ్మటాలు, చిన్నగోపురాలు, కమాన్లు, విలక్షణమైన రాచమహల్‌లలో భారతీయ శిల్పసంప్రదాయం ఉట్టిపడుతుంది.



**ఎలిఫెంటా గుహలు:**

**కొలాబా జిల్లా -ఎలిఫెంటో ద్వీపం, మహారాష్ట్ర (1987)**



ముంబాయికి సమీపంగా వున్న ఓమన్ సముద్రంలోని ఒక ద్వీపంపై గల గుహలనగరం ఇది. శైవమత సంబంధమైన రాతి కళా స్వరూపాలు అనేకం వున్నాయి. భారతీయకళకు ప్రతిభకు ప్రతిరూపాలుగా నిలుస్తాయి.

**ఎల్లోరా గుహలు:**

**ఖులాతాబాదు తాలుకా, వేరుల్‌గ్రామం, ఔరంగాబాదు జిల్లా, మహారాష్ట్ర. (1983)**



రెండు కిలోమీటర్లకు మించిన విస్తీర్ణంలో వున్న 34 మఠాలు, దేవాలయాలు ఇవి. కొండ శిఖరాన్ని ఆనుకుని వున్న కుడ్యంలో పక్కపక్కన తొలుచుకుంటూ వచ్చి వీటిని నిర్మించారు. ప్రాచీన భారతదేశ నాగరికత సజీవంగా, నిరంతరాయంగా చిత్రించిన ఈ కట్టడాలు క్రీ.శ 6 నుండి 10వ శతాబ్దానికి చెందినవి. ఎల్లోరా గుహలు కళాసృష్టికీ, సాంకేతిక నైపుణ్యానికి పట్టుగొమ్మలు. అంతేకాక అక్కడ గల బౌద్ధ, హిందు జైన మత ఆలయాలుప్రాచీన భారతదేశపు మత సహన స్ఫూర్తిని ప్రతిబింబిస్తాయి.

**ఫతేపూర్ సిక్రీ: ఆగ్రాజిల్లా,ఉత్తరప్రదేశ్, (1986)**



16వ శతాబ్ది ద్వితీయార్థంలో అక్బరు చక్రవర్తి నిర్మించాడు. విజయ సంకేతనగరం ఫతేపూర్‌సిక్రీ. పదిసంవత్సరాల పాటు మొగలాయి చక్రవర్తుల రాజధానిగా వుండేది. ఇక్కడి చారిత్రక కట్టడాలు, దేవాలయాలు అన్నీ ఒకే వాస్తుశిల్పి శైలిలో వుంటాయి. భారతదేశంలోని అతిపెద్ద మసీదుల్లో ఒకటైన జమామసీదు ఈ నగరంలో వుంది.



**మానస వన్యప్రాణి అభయారణ్యం: అస్సాంరాష్ట్రం. 1985లో ప్రపంచ వారసత్వ ప్రదేశంగా గుర్తింపు.**



హిమాలయ పర్వతాల దిగువ భాగంలోని శ్రేణులలో సాఫీగా, అందంగా వున్న వంపులు, దట్టమైన అడవులు నిండిన కొండలు వున్నాయి. పచ్చి గడ్డిమైదానాలు, వనాలు వున్న ఈ అభయారణ్యం ఎన్నోరకాల వన్యప్రాణులకు ఆశ్రయం మిచ్చింది. ముఖ్యంగా అంతరించిపోయే ప్రమాదంలో వున్న పెద్దపులులు, వామన వరాహాలు, భారతీయ ఖడ్గమృగాలు, ఏనుగులు ఇక్కడ కనిపిస్తాయి. ఈ ప్రదేశాలను చొరబాటుదారుల నుండి కాపాడటానికి వన వ్యవస్థను పటిష్టం చేసి, సురక్షితం చేయడానికి, ముఖ్యంగా ఏకశృంగ ఖడ్గమృగాలను పెంచడానికి చర్యలు తీసుకుంటున్నారు.

**ఖజురహో చారిత్రక కట్టడాల సముదాయం: మధ్యప్రదేశ్ (1985)**

క్రీ.శ.950 నుంచి 1050 వరకు అత్యంత ఉచ్ఛస్థితినందుకొన్న చందెల్ల రాచవంశము వారి పాలనలో ఖజురహో దేవాలయాలు కట్టారు. ఇరవై మాత్రమే మిగిలి వున్న యీ దేవాలయాలు రెండు స్పష్టమైన విభిన్న వాస్తుశైలికి చెందినవి. అవి హిందు, జైన మతాలు. శిల్పానికి, వాస్తుశాస్త్రానికి సమతూకంగా సమ్మేళనం కనిపిస్తుంది. భారతీయ కళకు పరాకాష్ట అనదగిన శిల్పాలతో కందాలియా ఆలయం అలరాడుతున్నది.



**మహాబలిపురములో చారిత్రక సముదాయము: తమిళనాడు (1984 లో గుర్తింపు)**

పల్లవ రాజులు కోరమండల్ తీరం వెంబడి 7,8 శతాబ్దాలలో నిర్మించిన యీ మందిరాలు, మండపాల సముదాయం రాతిలో చెక్కినవి. రథాలు, రాతి గుహలు బ్రహ్మాండమైన గంగావతరణం వంటి శిల్పాలు, పరమశివుని వైభవం తెలిపే వేలాది శిల్పాలు - యిక్కడి ప్రత్యేకతలు.





**బోధగయలో మహాబోధి దేవాలయ సముదాయం: బీహార్ (2002)**

గౌతమ బుద్ధుని నిజజీవితానికి ముఖ్యంగా దివ్య జ్ఞానోదయానికి సంబంధించిన నాలుగు ప్రదేశాలలో మహాబోధి దేవాలయసముదాయము ఒకటి. వీటిల్లో మొట్టమొదటి దేవాలయం క్రీ.పూ మూడవ శతాబ్దంలో అశోక చక్రవర్తి నిర్మించాడు. ప్రస్తుతమున్న దేవాలయాలు 5,6 శతాబ్దాలకు చెందినవి. గుప్తుల పరిపాలన తుదినాళల్లో పూర్తిగా ఇటుకలతో కట్టబడి యీనాటికి నిలిచి వున్న తొట్ట తొలి బౌద్ధాలయాల్లో ఒకటి.



**కేవల్‌దేవ్ జాతీయోద్యానవనం: భరత్‌పుర పట్టణానికి సమీపంలో, రాజస్థాన్. (1985)**



దీని విస్తీర్ణం 2873 హెక్టార్లు. ఇది కృత్రిమంగా తయారుచేసిన చెమ్మ ప్రదేశం. వానాకాలంలో ఒకటి రెండు మీటర్ల లోతు నీటితో నిండిపోతుంది. ఈ ఉద్యానవం ప్రత్యేకత ఏమిటంటే ఆఫ్ఘనిస్థాన్, తుర్కమెనిస్థాన్, చైనా, సైబీరియాల నుండి వలస నీటి పక్షులు 364 రకాల వరకు వచ్చి నివాసముంటున్నాయి. అపురూపమైన సైబీరియా కొంగలు వస్తాయి. జత కోసం అద్భుతమైన నాట్యం చేసే 'సరస్' కొంగలు కనిపిస్తాయి. ఇది ప్రకృతి సహజమైన వారసత్వ విలువ కలిగిన ప్రదేశం.

**భారతదేశంలోని పర్వత రైల్వేలు: (1999, 2005)**



ఎగుడు దిగుడు పర్వత ప్రాంతాలపైన చక్కగా నడిచే రైలు దారులను నిర్మించడమనేది సాహసంతో, ఉవజ్ఞతో కూడిన ఇంజనీరింగు ప్రతిభకు తార్కాణం.రాకపోకల సమస్యలు తీరుస్తూ అత్యంత సుందరమైన దృశ్యాల గుండా పర్వతాలను దాటిస్తూ ప్రయాణించడం యీనాటికి సాగుతోంది. డార్జిలింగు హిమాలయ రైల్వే 1881లో ప్రారంభమైంది. నీలగిరి కొండ దారిరైల్వే 1854లో ప్రతిపాదించి, 1891లో ప్రారంభించారు. కానీ 326 నుంచి 2203 మీటర్ల ఎత్తున ఉన్న ఉన్నత పర్వత ప్రదేశాలపైన పనిచేయవలసి వుండటంతో 1908లోనే అది పూర్తయ్యింది. బ్రిటిషు వలస పరిపాలన రోజుల్లో ప్రజలను సులువుగా [illegible] ఇటు చేరవేస్తూ సామాజిక, ఆర్థిక అభివృద్ధికి తోడ్పడటం ఎంతో విశేషం.



**హంపీలోని ప్రాచీన కట్టడాల సముదాయం: బళ్ళారి జిల్లా, కర్నాటక (1986)**



చిట్టచివరి హిందు రాజులైన విజయనగరరాజుల రాజధాని హంపీ. ఇది ఎంతో అద్భుతమైన, దర్శనీయమైన, వైభవమైన ప్రదేశం. అత్యంత సంపన్నులైన యీ రాజులు ద్రావిడ వాస్తుశిల్పశైలిలో దేవాలయాలు, రాజప్రాసాదాలు నిర్మించారు. 14,16 శతాబ్దాలలో వచ్చిన పర్యాటకులు వీటిని ఎంతో ఆరాధన భావంతో వర్ణించారు. 1565లో దక్కన్ మహమ్మదీయ కూటమి వాళ్లు దీనిని జయించి విధ్వంసం చేసి వదిలి పెట్టి పోయినారు.



**హుమయూన్ సమాధి: ఢిల్లీ (1993)**

1570వ సంవత్సరంలో నిర్మించిన యీ సమాధి భారత ఉపఖండంలోని మొట్టమొదటి ఉద్యానవన సమాధి కనుక యిది ఎంతో ప్రాముఖ్యమైనది. దీనిని నమూనాగా, మార్గదర్శకంగా స్వీకరించి ఎన్నో బ్రహ్మాండమైన సృజనాత్మకమైన చారిత్రక కట్టడాలు నిర్మించారు. చివరికి తాజ్‌మహల్ నిర్మాణానికి దారి తీసిందని చెప్పవచ్చు.

**కాజీరంగా జాతీయోద్యానవనం: బ్రహ్మపుత్ర నది దక్షిణ ప్రాంతం, అస్సాం.(1985)**



42,996 హెక్టార్ల విస్తీర్ణం కల యీ పార్కు మూడు ప్రధాన విభాగాలకు చెందిన వనాలతో నిండివుంది. సుమారు మూడింట రెండువంతులు పచ్చికమైదానాలే. బ్రహ్మాండమైన సైజులలో ఒక కొమ్ముగల ఖడ్గమృగానికి నెలవుగా యీ ఉద్యానవనం అంతర్జాతీయంగా ప్రసిద్ధిచెందింది. అంతేకాక పులులు, ఏనుగులు, చిరుతపులులు, ఎలుగుబంట్లు, అడవిదున్నలు మొదలైన అనేక జంతువులు ఉన్నాయి. కాజీరంగ గ్రామం దగ్గర ఊదారంగు పెలికాన్ పక్షుల నివాసముకాగ కొన్నివేల వలస పక్షులు వచ్చిపోతుంటాయి.



**కోణార్క్‌లోని సూర్యదేవాలయం: ఒరిస్సా రాష్ట్రం**

ఒరిస్సా కళావైభవంలో అత్యంత అద్భుతమైన సౌందర్యం మట్టిపడే ప్రదేశం కోణార్క్ దగ్గర సూర్యదేవాలయం. తూర్పుగాంగేయ వంశరాజు ఒకటవ నరసింహదేవ్ కాలంలో 1250లో నిర్మించారు. ఆ ప్రదేశానికి ముఖ్య దైవమైన సూర్యభగవానుని (అర్క) మూర్తిని అక్కడ ప్రతిష్ఠించాడు. సునిశితము, కమనీయమైన చెక్కడాల పన్నెండు జతల చక్రాలపైన ఉరకలెత్తే ఏడు గుర్రాలు లాగుతున్న రథం ఆకారంలో మొత్తం దేవాలయం కట్టడాన్ని రూపొందించారు. గర్భగుడిలో సూర్యభగవానుని అసమానగమన విలాసం గోచరిస్తుంది. ఒరిస్సా దేవాలయం శిల్పానికి యిది పరాకాష్ట. దేవాలయ కుడ్యాలపైన దేవత, మానవ, జంతు మూర్తులు అను పుష్పాలు, రేఖాగణిత శాస్త్ర ఆకారాల మధ్య రమణీయంగా చెక్కారు.

**తాజ్‌మహల్: ఆగ్రాజిల్లా, ఉత్తరప్రదేశ్ (1983)**

మొగలాయి చక్రవర్తి షాజహాను తన ప్రియతమ భార్య ముంతాజ్‌మహల్ జ్ఞాపకార్థం కట్టించిన అతిలోక సుందర కట్టడం తాజ్‌మహల్. అపురూప శిల్పసౌందర్యంతో 1631 -1648 మధ్య నిర్మితమైన ఈ పాలరాతి నిర్మాణం భారతదేశంలో ముస్లింకళకు కలికి తురాయిగా నిలుస్తుంది. ప్రపంచవింతలలో ఎనిమిదో వింతగా చేరిన తాజ్‌మహల్ ప్రపంచ వారసత్వ సంపదగా అంతర్జాతీయంగా విశేషఖ్యాతి గడించింది.



**సాంచీబౌద్ధ స్థూపాలు: మధ్యప్రదేశ్ (1989)**



భోపాల్ నుంచి దాదాపు 40కి.మీ దూరంలో ఒక కొండమీద గల సాంచీ ప్రాంతం ఏకశిలా స్థంభాలు, రాజమహాళ్ళు, దేవాలయాలు, బౌద్ధమఠాలతో వెలసివుంది. వీటిలో చాలావరకు క్రీ.పూ. 1-2 శతాబ్దాలకు చెందిన నిర్మాణాలు. ప్రస్తుతం అతి ప్రాచీనమైన ప్రాంతంగా వున్న ఏకైక బౌద్ధకేంద్రం ఇదే. క్రీ.శ. 12వ శతాబ్ది వరకు భారత దేశంలో ప్రధానమైన బౌద్ధ కేంద్రంగా విలసిల్లింది.

**సుందరవనాల జాతీయపార్కు: పశ్చిమబెంగాల్ (1987)**

సుందరవనాల ప్రాంతం గంగానది డెల్టాలో 10వేల చదరపు కిలోమీటర్ల విస్తీర్ణంలో విస్తరించి వుంది. కొంతమేర భూమిపైన, కొంతనీటిలోను వున్న ఈ వన ప్రాంతం సగానికి మించి భారత దేశంలో మిగతాది బంగ్లాదేశ్‌లో వుంది. ప్రపంచంలోని అతిపెద్ద మ్యాన్‌గ్రోవ్ అటవీప్రాంతంలో శోభించే ఈ సుందర వనాల జాతీయ పార్కు పులులు, జల క్షీరదాలు, పక్షులు, సరీసృపాల వంటి అరుదైన జంతు జాతులకు నెలవుగా వుంది.



**పట్టడకల్ వద్ద గల స్మారక కట్టడాలు: బదామితాలుకా, బీజాపూర్ జిల్లా, కర్ణాటక (1987)**



కర్ణాటకలోని పట్టడకల్ వివిధ కళల సమ్మేళనానికి పరాకాష్ఠగా నిలుస్తుంది. 7-8 శతాబ్దాలలో చాళుక్యరాజుల హయాంలో ఉత్తర దక్షిణ భారత శిల్పకళారూపాల మేలు మేళవింపును ఈ స్మారక స్థూపాలలో చూడవచ్చు. చూపరులను ఆకట్టుకునే తొమ్మిది హిందూ దేవాలయాలు, జైనుల దేవాలయం పక్కపక్కనే దర్శనమిస్తాయి. విరూపాక్ష ఆలయం వీటిలో విలక్షణమైంది. క్రీ.శ. 740 ప్రాంతంలో రాణి లోకమహాదేవి ఈ ఆలయాన్ని కట్టించింది. దక్షిణాది రాజులపై తన భర్త విజయానికి గుర్తుగా ఆమె ఈ ఆలయ నిర్మాణం గావించింది.

**నందాదేవి - వ్యాలీ ఆఫ్ ఫ్లవర్స్ జాతీయపార్కులు: ఉత్తరాంచల్ (1988).**



హిమాలయాల్లోని అటవీప్రాంతాల్లో వున్న అద్భుతమైన పార్కులు ఇవి. నందాదేవి జాతీయపార్కు నందాదేవి పర్వత శిఖరాగ్రాన వుంది. ఈ పర్వతాల ఎత్తు 7,800మీటర్లు. అంత ఎత్తున వుండడం చేత అందరూ చేరలేని ప్రాంతమైనందున నందాదేవిపార్కు సహజమైన అందాలు కోల్పోకుండా నిలిచివుంది. మంచుచిరుతలు, హిమాలయ కస్తూరిజింకల వంటి అంతరించిపోయే అరుదైన క్షీరజాతి జంతువులకు నెలవు ఈ నందాదేవి పార్కు. ఇక వ్యాలీఆఫ్ ఫ్లవర్స్ జాతీయ పార్కు ఆల్పయిన్ పువ్వుల బయళ్ళకు ప్రసిద్ధమైంది. వర్ణించనలవికాని ప్రకృతి సోయగాలను విరజిమ్మే ఈ పార్కు ఆసియా నల్లఎలుగు, మంచుచిరుత, నీలిగొర్రె వంటి అరుదైన వన్యమృగాలకు ఆలవాలం. జన్‌స్కార్ పర్వతశ్రేణులకు, గ్రేట్ హిమాలయ శ్రేణులకు మధ్యగల ఈ పార్కుల ప్రదేశం శతాబ్దానికిపైగా పర్వతారోహకులు, వృక్షశాస్త్రజ్ఞులను తనసాటిలేని మేటి అందాలతో మంత్ర ముగ్ధులను చేస్తోంది. హిందు పురాణాలలో కూడా ఈ సుందరవనాల వర్ణనలు కనిపిస్తాయి.



**కుతుబ్‌మీనార్ - స్మారక నిర్మాణాలు: ఢిల్లీ (1993).**

ఢిల్లీకి దక్షణ దిశగా కొద్ది కిలోమీటర్ల దూరంలో వున్న కుతుబ్‌మినార్ 13వ శతాబ్దపు తొలిసంవత్సరాల్లో జరిగిన నిర్మాణం. కుతుబ్‌మినార్ శిఖరాన్ని ఎర్రఇసుక రాయితో నిర్మించారు. దీని ఎత్తు 72.5మీటర్లు. శిఖరాగ్ర వ్యాసం 2.75మీటర్ల కాగా అట్టడుగు పరిమాణం 14.32 మీటర్లు. ఒకదాని తర్వాత ఒకటిగా కోణాకారాలు, వలయాకారాలతో కూడిన కుతుబ్‌మినార్ ఒక అద్భుతమైన కట్టడం. చుట్టుపక్కల వున్న ప్రాంతం పురావస్తు ప్రాశస్త్యం కలిగింది. ఈ ప్రాంతంలో భారత - ముస్లిం కళాసమ్మేళనంతో రూపుదాల్చిన కళాఖండం అలై-దర్వాజాగేటు (1311లో నిర్మితం), రెండు మసీదులు, ఇతర భవనాలు వున్నాయి. కువ్వాతుల్ - ఇస్లామ్ మసీదు ఉత్తర భారతదేశంలో అతి ప్రాచీనమైన నిర్మాణం. సుమారు 20 దేవాలయాల నుండి సంగ్రహించిన నిర్మాణ సామాగ్రిని పునర్వినియోగించి ఈ మసీదు నిర్మించారు.

**చంపనేర్, పావుగడ్ పురావస్తు ఉద్యానవనం: పంచమహల్ జిల్లా, గుజరాత్. (2004)**



ఇవి యింతవరకు తవ్వకాలు జరపని పురావస్తు, చారిత్రాత్మక సజీవ, సంస్కృతీ నిక్షేపాలు. వీటిల్లో 16వ శతాబ్దంనాటి గుజరాత్‌రాష్ట్ర రాజధాని అవశేషాలు, చరిత్రకందని ప్రాచీన హిందూ రాజధాని రాతికోట, పాతబొగ్గు యుగంనాటి కొన్ని స్థలాలకు ఆలవాలమైన అద్భుతమైన మైదానాలు ఉన్నాయి. ఈ ప్రదేశంలో యితర నిక్షేపాలతో పాటు వున్న కోటలు, రాజమహళ్లు మతసంబంధ మందిరాలు, ఆవాస గృహాలు, వ్యవసాయసంబంధ నిర్మాణాలు జలాగారాలు, ఎనిమిది నుంచి 14వ శతాబ్దాలకు చెందినవి. పావుగడ్ కొండ మీది కాళిమాత దేవాలయం అత్యంత ప్రాముఖ్యతవున్న దేవాలయం. ఏడాది పొడుగున అధిక సంఖ్యలో సందర్శనానికై జనం వస్తారు. పురావస్తు శాఖ వారి ప్రకరణలు మనదేశంలో పరిరక్షించి, తక్షణం దృష్టి సారించవలసిన ప్రదేశాలు అనేకం వున్నాయి.

## ఆల్చీ, జమ్ము కాశ్మీరు

జమ్ముకాశ్మీరులోని లేహ్ సమీపంలో 'ఆల్చీ' బౌద్ధమత సముదాయం 10వ శతాబ్దంలో నిర్మితమైంది. వీటిలో అత్యంత పవిత్రమైన సమ్‌స్టెక్/- డ్యూ-ఖాంగ్-సోనూ/ మంజుశ్రీ లా -ఖాంగ్/ లోత్సవ -లాఖాంగ్ -గోంపాలు వున్నాయి. వీటిలో మూడంతస్థుల సమ్‌స్టెక్ గోంపా అన్నింటికంటె ముఖ్యమైనది. ఇందులో వైరోచనుడు ప్రధానమూర్తి. ఆ పక్కనే పంచబుద్ధులు వెంట దేవతామూర్తులు వుంటాయి. ఇంకా వివిధ రకాల బౌద్ధ రూపాలు, బోధిసత్వులు వున్నాయి. వీటిలో మట్టితో చేసి, చెక్కలో చెక్కి  రంగులు అద్దినవి వున్నాయి.

## భాజా-కార్లే గుహలు



మహారాష్ట్రలో వున్న భాజా -కార్లే గుహలు బౌద్ధమత -హీనయానానికి చెందిన తొలినాటి రాతిలో చెక్కిన చైత్యాలు లేదా దేవాలయ మందిరాలు. వీటిలో క్రీ.పూ.200 సంవత్సరాల నాటి భాజాచైత్యం మొట్ట మొదటిది. కార్లేలోని బ్రహ్మండమైన చైత్య అతిపెద్దది. హీనయానంలో ఉచ్ఛస్థితికి ప్రతీకగా నిలుస్తుంది.

## భువనేశ్వర్

ఒరిస్సాలోని భువనేశ్వర్ ప్రధానంగా దేవాలయాలు, తటాకాల మహాపట్టణం. లింగరాజ దేవాలయం కొన్ని మైళ్ళ విస్తీర్ణంలో మహత్వమైందిగా నిలుస్తుంది. కళింగుల కాలం నాటి వాస్తుశైలిని ప్రతిబింబిస్తుంది. 7వ శతాబ్దం నుండి ఆరంభమై 12-13 శతాబ్దాల నాడు ఉచ్ఛస్థితికి చేరుకున్న ఆనాటి వాస్తుశైలిని మనం లింగరాజ దేవాలయ పరిసరాల్లోని దేవాలయ సముదాయంలో చూడగలుగుతాం. గంభీరమైన శిల్పవాస్తు సంపదతో అలరారే ఈ దేవాలయం పవిత్ర ఏకామ్రక్షేత్రంగా ప్రసిద్ధి చెందింది. ఒరిస్సాలోని మధ్యయుగాల తొలికాలానికి చెందిన ఐదు మహత్తర మత కేంద్రాలలో ఒకటైన ఈ దేవాలయం చూపరులను పులకరింపజేస్తుంది.



## బీజపూరు

కర్ణాటకలోని బీజపూరు నగరంలో వున్న మహమ్మద్ ఆదిల్‌షా (క్రీ.శ. 1627-57) గోరీ దర్శించవలసిన ప్రదేశం. దీనిని గోల్‌గుంబద్ అని పిలుస్తారు. ఈ గోల్‌గుంబద్ ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన అతిపెద్ద గోపురం. దానిలోపల వున్న పెద్ద గ్యాలరీని గుసగుసల గ్యాలరీ అంటారు. అంటే ఈ గ్యాలరీలో రహస్యంగా మాట్లాడినా ప్రతిధ్వనించి ధ్వని తరంగాలు వెలువడుతాయి.
గగన్‌మహల్ - ఇబ్రహీం రాజ  కూడా బీజపూర్‌లో చూడదగిన కట్టడాలు. ఇక మిహితార్‌మహల్‌కు రెండు మూలల నాజుకుగా రెండు స్తంభాలు వుంటాయి. ఈ ప్రవేశ ద్వారాల గుండా వెడితే ఒక మసీదులోకి ప్రవేశిస్తాం. ఈ మసీదును క్రీ.శ 1620లో రెండవ ఇబ్రహీం ఆదిల్‌షా పాలన కాలంలో నిర్మించారు.

## బిష్ణుపూరు

పశ్చిమబెంగాల్‌లోని బిష్ణుపూరు దేవాలయాలు మల్లరాజుల కాలంలో (క్రీ.శ.1600-1700) కట్టించినవి. ఈ రాజులు భక్తితత్పరులు. వారు అనేక దేవాలయాలు, తటాకాలు కుడ్యలు, మార్గద్వారాలు నిర్మించారు. ఎంతో పటిష్టంగా, ఇష్టికాశిల వాడి వీటిని నిర్మించారు. బిష్ణుపూర్ ఆలయాలు టెర్రకోట అలంకరణకు ప్రసిద్ధిగాంచాయి.



**చిత్తోడ్‌ఘర్**

చిత్తోర్‌ఘర్ కోట రాజస్థాన్‌లో వుంది. భారత దేశంలో ప్రఖ్యాతి గాంచిన అతి పెద్ద రాజదుర్గాలలో ఒకటి. ఈ కోటలో పవిత్రమైన జలాశయాలు, బ్రహ్మాండమైన దేవాలయాలు, శిఖరాలు, ప్రాసాదాలు, ఛత్రీలు, మసీదులు, బజార్లు విలక్షణంగా వుంటాయి. ముఖ్యంగా విజయస్థంభం లేదా విజయశిఖరం చాలా ఎత్తయిన భవనం. ఇందులో 9 అంతస్థులు వుంటాయి. మహారాణా కుంభ (క్రీ.శ.1433-68) దీనిని నిర్మించారు. ఇంకా గోముఖ రిజర్వాయరు, సమిధేశ్వర ఆలయం, మీరా, కుంభశ్యామ, సత్‌బీస్‌దేవరి ఆలయాలు ప్రధానంగా చెప్పుకోవలసినవి. రాజప్రాసాదాలలో రాణాకుంభ, రాణిపద్మిని, రతన్‌సింగ్ ప్రాసాదాలు ప్రధానమైనవి.

**దౌలతాబాద్**

దౌలతాబాద్ కోట (మహారాష్ట్ర) దూరంగా ఎక్కడో వున్న ఒక కొండమీద నిర్మితమైనది. చుట్టూ గల భూమికి దాదాపు 61 మీటర్ల ఎత్తులో దీన్ని నిర్మించారు. యాదవ వంశ రాజుల రాజధాని దౌలతాబాద్. క్రీ.శ.1318లో ముబారక్‌షా ఖిల్జీ దేవగిరి రాజును పదవీచ్యుతుణ్ణి చేశాడు. రాజధానిని ఢిల్లీ నుంచి దేవగిరికి మార్చింది మహమ్మద్‌బిన్‌తుగ్లక్. దేవగిరికి దౌలతాబాదుగా నామకరణం చేశాడు. అనంతరం ఈ కోట అహ్మద్‌నగర్‌కు చెందిన బహమనీ రాజు నిజాంషా చేతుల్లోకి వచ్చింది. ఈ తర్వాత మొఘల్ చక్రవర్తులకు వెళ్ళి అక్కడ నుంచి హైదరాబాదు మొదటి నిజాం ఆసఫ్‌ఝా వద్దకు చేరింది. కోటలోని అగడ్త, కోటకు దారితీసే వలయాకారంలో వున్న దారి విశేషంగా ఆకర్షిస్తాయి. ఇవి ఘనమైన రాతి కట్టడాలు.

## కొన్ని చెప్పుకోదగిన ప్రపంచవారసత్వ నగరాలు: యునెస్కో గుర్తింపునిచ్చినవి.

1. కెనడాలోని క్యూబెక్ చారిత్రిక ప్రదేశాలు (1985)

2. చైనాలోని లిజియంగ్ ప్రాచీనమైన పట్టణం (1997)

3. చైనాలోని పింగ్యాల్ ప్రాచీననగరం (1997)4. బెల్జియంలోని బ్రస్సెల్సు -గ్రాండ్ప్యాలెస్ (1998)

5. ఈజిప్టులోని ఇస్లామిక్ కెయిరో (1979)

6. వాటికన్ సిటీ, హోలీసీ (1984)

7. రోమ్ చారిత్రక నగరం, హోలీసీ వస్తు సంపద, ఇటలీ

8. ఇరాన్లోని ఇస్ఫాహన్ మీదన్ ఇమామ్ (1979)

9. ఫ్రాన్సులోని పారిస్, సీన్నది ఒడ్డు (1991)

10.ఇటలీలోని చారిత్రాత్మక ఫ్లారెన్స్నగరం (1982)

11. ఇటలీలోని వెనీస్, దాని లగూన్ (1987)

12.జెరుసలేం పాతనగరం, వాటిగోడలు (1981)

13.నేపాల్లోని ఖాట్మండులోయ (1977)

14.యునైటెడ్కింగ్డమ్లోని బాత్నగరం (1984)

15.యునైటెడ్కింగ్డమ్లోని ఎడిన్బరో ప్రాచీన, నవీన పట్టణాలు (1987)





# వారసత్వ నగరంగా హైదరాబాదుకు గుర్తింపు రావాలి!

చరిత్రకందని అతి ప్రాచీన కాలము నుండి యీనాటి ఆధునిక కాలము వరకు హైదరాబాద్ నగరం ఎంతో జనాభాతో విలసిల్లుతోంది. ఈనాటి యీ స్వరూపము 12వ శతాబ్దంలో గోల్కొండ కేంద్రంగా వున్నప్పటి నుండి, 16వ శతాబ్దంలో హైదరాబాద్ కేంద్రంగా విస్తరించి, 1800లో సికింద్రాబాదు ఆవిర్భావించింది.

ఆయాచోట్లలో నేటికీ చైతన్య జనజీవనం నిండిన ప్రాంతాకు వాటి ప్రాచీనత, చరిత్ర, వాస్తు ప్రాముఖ్యత ప్రకారం విభజించి, 12 నుండి 20వ శతాబ్దం వరకు జరిగిన పరిణామాలు స్పష్టంగా గోచరిస్తాయి. పది చారిత్రిక సముదాయలు గోల్కొండ, కార్వాన్, చార్‌మీనార్, గోషామహల్, కోఠి, అబిడ్స్, నాంపల్లి, ఖైరతాబాదు, సికింద్రాబాదు, కంటోన్మెంటు, ఉస్మానియా యూనివర్శిటీగా గోరినస్తున్నాయి. వాటి చారిత్రకి మూలాలు, ప్రస్తుత మునిసిపాలిటీ సరిహద్దుల ప్రకారం యీవిభజన సమంజసంగాను, సహేతుకంగాను వున్నది. కానీ వీటి పరిసర ప్రాంతాలు, కేంద్ర స్థానం వంటివి పరిశోధన ద్వారాగానీ క్రోడీకరించలేము.(దీనికి సంబంధించి మన ప్రభుత్వం యునెస్కోకు పంపిన సచిత్ర పత్రాలు నమూనా ప్రతిని అనుబంధంలో చూడండి.)

## ఇప్పుడు ఏమిచేయాలి?

1. మునిసిపాలిటీల సరిహద్దుల్లో వున్న చారిత్రిక సముదాయ ప్రాంతాలు, వీధులు, స్థలాలు, భవంతులు గుర్తించాలి.
2. వీటన్నింటినీ హైదరాబాదు మున్సిపల్‌కార్పోరేషన్ పాలన, నియంత్రణ కిందకు తీసుకొనిరావాలి.
3 ప్రతిసర్కారు ఆఫీసులో “వారసత్వ” విభాగాలు ఏర్పాటు చేసి సాంకేతిక సహాయ సేవలు అందచేస్తూ చారిత్రక స్థలాలు, కట్టడాలు పరిరక్షించాలి.
4. గుర్తించిన చారిత్రక ప్రదేశాలను ఎలా పరిరక్షించాలనే దృష్టి ప్రధానంగా వుండాలి.

కేంద్ర ప్రభుత్వం పురావస్తుశాఖ ద్వారా చార్మినార్, గోల్కొండలో కొంతభాగం మాత్రమే సంరక్షిత ప్రాచీన కట్టడాలు. రాష్ట్ర పురావస్తు, మ్యూజియమ్‌ల శాఖ ద్వారా 32 కట్టడాలు పరిరక్షితములు. ఒక చిత్రమైన ఉదాహరణ ఏమిటంటే మలక్‌పేటలోని ‘రేమాండ్ సమాధి’ హఠాత్తుగా కూలిపోయింది. సాంకేతికంగా ఒక్కసారి కుప్పకూలిపోయే అవకాశం వుండదు. ఎక్కడో బీటలు వగైరా సూచనలుంటాయి. ‘పరిరక్షిత’ ప్రాంతమంటే, ఒక కాపలాదారో, మరెవరో వుండాలి కదా! ఏమి జరిగిందో ప్రజలకి తెలియదు కాని తిరిగి దాన్ని అదే సమూనాలో కట్టేశారు. అది చరిత్రను వక్రీకరింప చేయడం కాదా!

## ఏ కట్టడానికి ఎంత విలువ, స్థాయి, హోదా?

హుడా 137 కట్టడాలు మాత్రమే ‘పరిరక్షించవలసిని కట్టడాలుగా గుర్తించి ప్రకటించాడు. అవి 1, 11ఏ, 11బి, 111 - అనే వర్గీకరణ చేశారు. ఈ సంఖ్య వాస్తవానికి ఏ విధంగాను సరిపోలదు. అంతేకాక కొన్ని కట్టడాలకిచ్చిన గ్రేడ్ వాటికి క్షమించరాని అగౌరవం. ఫలక్‌నామాప్యాలెస్, రెసిడెన్సీకోఠి రెండవ స్థాయి కట్టడాలుగా పేర్కొనగా, అంబరుపేట బురుజువంటివి ఒకటవ శ్రేణిలో చేర్చారు.

**మన గోల్కొండ:**

2001వ సంవత్సరంలో ప్రపంచ వారసత్వ ప్రదేశంగా మరొక 11 ప్రతిపాదనలలో కలిసి యునెస్కో తాత్కాలిక (టెంటెటివ్)లిస్టులో పంపారు. అది నిరాకరించబడింది. మళ్ళీ పంపే ప్రయత్నం జరపలేదు. ఎంత చారిత్రాత్మక విలువ కలిగిన యీ మహన్నతమైన కోటకి ప్రపంచవారసత్వ ప్రదేశంగా గుర్తింపు పొందే అర్హతలున్నాయి.



# సంస్కృతీ వారసత్వ నగరంగా హైదరాబాద్



# సంస్కృతీ వారసత్వ నగరంగా హైదరాబాద్

కొన్ని నెలల క్రితం ఆఫ్ఘనిస్తాన్‌లోని బామియాన్‌లో ఆకాశాన్నంటే బుద్ధ విగ్రహాలు తాలిబాన్ పోరాటవాదులు తునాతునకలు చేసినప్పుడు, నిర్దాక్షిణ్యంగా, నిస్సంకోచంగా ప్రశాంతత మూర్తీభవించిన పురాతన బుద్ధులను నేలకూల్చినప్పుడు ప్రపంచవ్యాప్తంగా దిగ్భ్రాంతి వ్యక్తమైంది. ఈ ఘాతకం పట్ల ఆందోళన చెంది దేశాలు, సంస్థలు, నాయకులు, తాలిబన్‌ని మూర్ఖపు పట్టుదల విడనాడమనీ, విధ్వంసకాండ మానుకోమని హితవు చెప్పారు. పాత రాతి విగ్రహాల కూల్చివేత ఎందుకు ఇంత ప్రతిఘటన రేకెత్తించింది? సరిహద్దులతో సంబంధం లేకుండా అంతర్జాతీయ సమాజం ఎందుకు ఇంతగా ప్రతిస్పందించింది? అది మన అపురూప ప్రపంచ సంపద కనుక!

కొన్ని లక్షల సంవత్సరాల నుండి నదీనదాలు, పర్వతాలు, వనాలు, సముద్రాలు రూపాంతరం చెందుతూ అనంత సౌందర్యాన్ని, అద్భుత నిక్షేపాలనూ మానవజాతికందిస్తున్నాయి. కొన్ని సహస్రాబ్దాల నుండి మనిషి తన సృజనాత్మక శక్తినీ, కళాదృష్టినీ అంచెలంచెలుగా విస్తరింపచేస్తూ అపూర్వ సృష్టి చేస్తున్నాడు. జాతుల జీవన విధానాలు, నాగరికతలూ మార్పులు చెందుతున్నాయి. ఇవన్నీ విస్మయాన్ని కొలిపే దర్శనీయ ప్రదేశాలుగా మనుష్యులను ఆకర్షిస్తున్నాయి. చరిత్ర, సంస్కృతి, సంప్రదాయం, జీవనసరళి, మానవ ప్రతిభ





ప్రస్ఫుటించే యివన్నీ ప్రపంచవారసత్వాలు.

వీటిని కాపాడుకొని పదిలంగా తరతరాలుగా అందించవలసిన బాధ్యతను గుర్తెరిగిన యునెస్కో సంస్థ 1972లో " ప్రపంచ సాంస్కృతిక ప్రకృతి వారసత్వ పరిరక్షణ ప్రకటన " (వరల్డ్ హెరిటేజ్ కన్వెన్షన్)ను వెలువరిస్తూ తీర్మానం చేసింది. విశ్వజనీనమైన సాంస్కృతిక విలువ కలిగి మానవజాతి తమ వారసత్వంగా పరిరక్షించవలసిన ప్రదేశాలు, ప్రాచీన కట్టడాలు, నగరాల వివరాలను సభ్యత్వ దేశాల నుండి పొంది, వాటిని భావితరాలకు అందించడంలో జాతులు పరస్పరం సహకరించుకోవాలని

ఈ తీర్మానం నిర్దేశిస్తోంది. 107 దేశాలు 1997 నాటికి ఒప్పందంపై సంతకం చేశాయి. నేటికి ప్రపంచ వారసత్వాలుగా ఎంపిక అయిన స్థలాలు 506కు మించి వున్నాయి.

మన దేశంలో అజంతా, ఎల్లోరా, తాజ్ మహల్, కోణార్క్, ఆగ్రా కోట, సూర్య దేవాలయం, ఖజురహో వంటి 16 సాంస్కృతిక ప్రదేశాలు, సుందరబన్స్, నందాదేవి వంటి ప్రకృతి సంపద కలిగిన ప్రదేశాలు, హిమాలయన్ డార్జిలింగ్ రైలు వంటివి ఈ జాబితాలో వున్నాయి. అయితే ఆంధ్రప్రదేశ్‌లోని ఏ ప్రదేశము వారసత్వ జాబితాలో చోటు చేసుకోలేదు.

నూటనలభై నగరాలూ, పట్టణాలు ప్రపంచ వారసత్వ హోదా పొందాయి. వాటిలో జపాన్, నేపాల్, శ్రీలంక, చైనావంటి దేశాలకు చెందినవీ వున్నాయి. కానీ మనదేశంలో యింతవరకూ ఒక్క నగరం లేదు. సరైన ప్రతిపాదన ఏదీ మన దేశం నుండి పంపక పోవడమే కారణం.

ఇప్పుడే ఈ విషయమై నిశితంగా ఆలోచిస్తున్న ప్రభుత్వం నగరాలు ఎంపిక చేసే అవకాశం వుంది. అవి ఎన్ని, ఒకటా అంతకంటె ఎక్కువా అనేది అస్పష్టమైన అంశం. ఈ సందర్భంగా ప్రాచీన చరిత్ర ప్రపంచ శిల్ప, వాస్తుశిల్పం కలిగిన రాజభవనాలు, చర్చిలు, దేవలయాలు, ఉద్యానవనాలు కోటలు హైదరాబాదు నగరాన్ని వారసత్వ నగర హోదాకు ప్రతిపాదించడం సముచితంగా భావించాలి.



## హైటెక్ సిటీ మాత్రమే కాదు హెరిటేజ్ సిటీ కూడా

ప్రపంచ వారసత్వ జాబితాలో చారిత్రాత్మక పట్టణాలు, పట్టణప్రాంతాలను కూడా చేర్చడానికి నిశ్చయించారు. ఒక్కొక్క చరిత్ర ప్రధానమైన ప్రదేశాన్ని కేవలం భౌతిక స్వరూపంగానే కాక ప్రజల దైనందిన జీవిత కార్యకలాపాలతో కూడిన సమగ్ర నాగరికతా స్థలంగా పరిరక్షించడం కూడా ఈ పరిధిలో వస్తుంది. అదే విధంగా ఒక ప్రదేశానికి చరిత్రయే కాక బౌతికంగా వాస్తుశిల్పం వుండడం, ఆ వాస్తు శిల్ప చారిత్రాత్మకత పరిరక్షరణకు ప్రయత్నించడం కూడా అవసరం.

1987 అక్టోబరులో ఇందుకు సంబంధించిన ప్రపంచ ప్రకటన వెలువడింది. సమకాలీన జీవితంలో ఆధునిక అభివృద్ధి పథకాలకు అవకాశం యిస్తూనే అఖండన సంస్కృతీ వారసత్వ నిలయాలుగా పట్టణ ప్రాంతాల పరిరక్షణ.

శిథిలాలైపోయిన నగరాలే కాక, జనం నివసిస్తున్న చారిత్రక ప్రదేశాలు ఈ కోవలోకి వస్తాయి. అంతర్జాతీయ ప్రమాణాల ప్రకారం హైదరాబాదు నగరానికి అన్ని విధాల అర్హత వుంది. రాష్ట్రంలో ప్రభుత్వంగా గానీ, వారి తరపున గానీ కేంద్ర ప్రభుత్వానికి సంపూర్ణంగా వివరాలు, చిత్రపటాలు, మ్యాప్‌లూ, దాఖలాలు జతపరుస్తూ తమ ప్రతిపాదనను పంపాలి. కేంద్ర ప్రభుత్వం పరిశీలన అనంతరం ఢిల్లీలోని యునెస్కో కార్యాలయానికి పంపితే, వారు పారిస్‌లోని యునెస్కో



ప్రధాన కార్యాలయానికి పంపుతారు. అక్కడ సాంకేతిక నిపుణుల కమిటీ ప్రాథమిక పరిశీలన, స్థలసందర్శన తర్వాత, బేరీజు నివేదికను అందచేస్తారు. అర్హత కలిగిన వారసత్వ ప్రదేశాలు, పట్టణ, నగరాలను ఎంపికచేసి గుర్తింపు యిస్తారు. ప్రపంచ వారసత్వ హోదా అప్పుడే ప్రారంభమౌతుంది. ప్రపంచ పర్యాటకులను ఆకర్షిస్తుంది. సగర్వంగా సముచిత స్థానం అలకరించి నగరం తన వారసత్వాన్ని లోకానికి చాటి చెప్పుకోవచ్చును. ఆ హోదా పొందగలిగితే భాగ్యనగరం వైభవం ద్విగుణీకృత మౌతుంది. పరిరక్షణ బాధ్యత కూడా పెరుగుతుంది. పరిపాలనా యంత్రాంగం అందుకు అప్రమత్తం కావాలి.

### విభిన్న రీతులలో ప్రాచీన భవనాల విశిష్టత

భవనం విస్తీర్ణం అమరికలోనూ, సౌధసౌష్టవం, ఉపయోగించిన నిర్మాణ పదార్థాలు, భవనాల ఆకార స్వరూపాలు - ఒక భవన సముదాయంలో ఏక

## ప్రపంచ వారసత్వం

నాగరికత, లేదా నాగరికతల పరంపర ప్రతిఫలించినప్పుడు -అది విశిష్ట వారసత్వంగా పరిగణించవచ్చును.

హైదరాబాదు నగరంలో చెప్పుకోదగిన పలు చారిత్రిక ప్రదేశాలున్నాయి.

1. గోల్కొండ కోట, కుతుబ్‌షాహీ సమాధులు, షేక్‌పేట
2. కార్వాన్, పురానాపూల్
3. చార్మినార్, లాడ్‌బజార్, పత్థర్‌గట్టి, చార్‌కమాన్, నిజాం పాలెస్‌లు, మహబూబ్ చౌక్, నగర ప్రాకారాల లోపలి యితర ప్రదేశాలు, ప్రాకారపు గోడ, ప్రవేశద్వారం, శిధిలాలు.
4. రెసిడెన్సీ కోఠీ, సుల్తాన్ బజార్, బేగం బజార్, గౌలిగూడ, మొజాంజాహీ మార్కెట్, గన్‌ఫౌండ్రీ, ఆబిడ్స్, అసెంబ్లీ, జేమ్స్ స్ట్రీట్, జనరల్ బజార్, సికింద్రాబాదు మిలటరీ కంటోన్మెంట్

నగరంలో మొత్తంలో వ్యాపించిన కట్టడాలు. ఉదాహరణకు సైదాబాద్ కాలనీ, ఎఱ్ఱమంజిల్‌లో పైగా సమాధులు, మలక్‌పేటలో మహబూబ్ మాన్షన్ వంటివి. పైన ఉదహరించిన చారిత్రక ప్రదేశాలే కాక ప్రకృతి సిద్ధంగా ప్రత్యేకత ఉన్నవి

1. హైదరాబాదు సరస్సులు, చెరువులు.
2. శిలానిక్షేపాలు -వాటిలో కొన్ని వేలాది ఏళ్ళ కిందటివి.
3. చరిత్రాత్మకమైన ఉద్యానవనాలు, పార్కులు ప్రకృతి ప్రసాదించిన అందమైన వృక్ష, జల, శిలావైభవంతోపాటు, అపురూపమై, బ్రహ్మాండమైన కట్టడాలు కూడా ఘనమైన ఈ వారసత్వానికి చిహ్నాలుగా నిలచి, ప్రపంచ ప్రజలను ఆహ్వానిస్తున్నాయి.

# మన నగరం గొప్పదని మునుపు ఎవరన్నా అన్నారా?

ఎందరో అన్నారు. లండన్‌లో 1590లో విలియం మెథోవోల్ట్ ఆయన పుట్టాడు. 1616లో ఆయన ఈస్టిండియా కంపెనీ పక్షాన భారత్ వచ్చాడు. 1618-22 మధ్య సంవత్సరాలలో ఆయన మచిలీపట్నంలో వుంటూ హైదరాబాదు సందర్శించాడు.

"మధురమైన ఆవుపాలకీ, జలసమృద్ధికీ, సారవంతమైన భూమికీ, భారత్‌లో అత్యుత్తమ స్థానంలో నిలచి వున్నది. ప్రభువు రాజభవంతి, విస్తీర్ణంలోనూ, వైభవంలోనూ - యిదివరకూ ఈ దేశంలో పర్యటించినవారు. మెచ్చుకొన్న -మొగలాయి, యితర రాజుల ఘన ప్రాసాదాలను మించిపోయి వున్నది. పన్నెండు మైళ్ళచుట్టు కొలతలో, మొత్తం రాతి కట్టడం, అంతర్భాగాలలోని ముఖ్యమైన ప్రదేశాలు, మనం మామూలుగా ఇనుము ఉపయోగించే భాగాలు కిటికీలు, గడియలూ, సీలలవంటివి -మందమైన బంగారంతో చేశారు. రాజుగారి ఏనుగులు, ఆభరణాలను బట్టి, భారత్‌లోని అతి భాగ్యవంతులైన రాజులలో ఒకరుఅని చెప్పవచ్చును". ఇదీ హైదరాబాదు గురించి ఆయన అభిప్రాయం. జాన్ బాప్టిస్ట్ టెవర్నీయర్ అనే పారిస్ పర్యాటకుడు 1645లోనూ 1653లోనూ రెండుసార్లు గోల్కొండను సందర్శించాడు. "బాగ్‌నగర్ అంటే ఉద్యానవనాల నగరం. ఇక్కడ ఫ్రాన్స్‌లోని 'ఫౌంటెన్ బ్లూ'లో వలె ఎన్నో సుందర ఆకృతుల్లో శిలలు కన్పిస్తున్నాయి. 'పాంట్‌న్యూ' సుందర కట్టడానికి తీసిపోని సుందరమైన వంతెనను పెద్ద నదిమీద కట్టారు. చక్కగా నిర్మించబడిన నగరం, విశాలమైన వీధులు..." అని వ్రాశాడు.

ఎమ్.థెవెనోట్ అనే పారిస్ విశ్వవిద్యాలయ విద్యార్థి 1666-67 సంవత్సరాలలోనూ , అబ్బే కర్రె అనే మరో ఫ్రెంచి యువకుడు 1673లోనూ, ఇంగ్లాండ్‌కి చెందిన మీడోస్ టైలర్ 1825లోనూ నగరాన్ని సందర్శించారు. "వర్ణనాతీతమైన సుందర దేశం -బ్రహ్మాండమైన మక్కామసీదు, సొగసులొలికే చార్‌మినార్, అతి పెద్దదైన మీర్ ఆలం ట్యాంక్" అని వర్ణిస్తూ టైలర్ మురిసిపోయాడు.

వారసత్వంగా సరిగణించే ప్రాచీన కట్టడాలు, భవనాలను కూలదోయకుండా కాపాడడం చెప్పినంత తేలిక కాదు. ఇందులో చట్టాల ప్రమేయం చాల వుంది. నగరంలో ఏదో ఒక మూల ఒక ప్యాలెస్‌నూ, బురుజునూ, దేవిడీని కూలగొట్టారని వింటుంటాం, చదువుతుంటాం. వీటి పరిరక్షణకు ప్రభుత్వం చర్యలు తీసుకుంటూనే వస్తున్నది. ఉదాహరణకు 1975లో అర్బన్ ఆర్ట్ కమీషన్ ఏర్పడి ప్రభుత్వం ఒక ఆర్డర్ జారీ

చేసింది. 1995లో హుడా, 137 భవంతులను 'వారసత్వ నిబంధనల' పరిధిలోకి తీసుకువచ్చి, ప్రకటనలు చేసింది. కేంద్ర చట్టాలు, రాష్ట్ర ప్రాచీన కట్టడాల పరిరక్షణ చట్టాలు వుండనే వున్నాయి. (మన రాష్ట్ర టూరిజం శాఖ చార్‌మినార్ చుట్టు 'కాలినడక ప్రాంతంగా' ప్రకటించింది. వాహనాల నియంత్రణ చేయాలనేది కూడా ఎంతో ముఖ్యమైన చర్య.)



ఆర్కియలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా పరిధిలోకి చార్‌మినార్, గోల్కొండ కోటలో ఒక చిన్నభాగం మాత్రమే వస్తున్నాయి. రాష్ట్రప్రభుత్వ పురావస్తుశాఖ 30 పురాతన కట్టడాలను గుర్తించి పరిరక్షిస్తోంది. వీటిలో చరిత్ర షాహీ మసీదులు, సమాధులు, సరాయిలూ వున్నాయి. హైదరాబాదుకి చరిత్ర వుంది, వారసత్వం వుంది. వారసత్వ పరిరక్షణకు అవసరమైన సమగ్రమైన చట్టాలు వున్నాయి. హైదరబాదు నగరానికి ప్రపంచ వారసత్వ నగరంగా హోదా కల్పించేందుకు అవసరమైన ప్రతిపాదన రూపొందించి పంపించడమే ఆలస్యం, ఆధునికత, విలక్షణమైన ప్రాచీనత కలబోసిన ఈ నగరం ప్రపంచ సాంస్కృతీ కేంద్రాల సరసన నిలుస్తుంది.



## ప్రపంచ వారసత్వ పరిరక్షణలో ముఖ్యమైన ఘట్టాలు

- 1972 నవంబరులో పారిస్‌లో వెలువరించిన 'ప్రపంచ సాంస్కృతి ప్రకృతి సిద్ధమైన వారసత్వం' గురించి ప్రకటన (కన్వెన్షన్) వివిధ వర్గీకరణలనూ, జాబితాలో చేర్చే విధానాలనూ నామినేషన్ విషయంలో అనుసరించవలసిన పద్ధతులను, దరఖాస్తు పరిశీలన గడువులను ఇందులో స్పష్టంగా పేర్కొన్నారు.
- అక్టోబరు 1987లో చారిత్రాత్మక పట్టణాలు, పట్టణప్రాంతాల పత్రం (ఛార్టర్) జారీ అయింది. యునెస్కో కౌన్సిల్ ఆఫ్ యూరప్, అంతర్జాతీయ సాంస్కృతి సంపద పునరుద్ధరణ, పరిరక్షణల అధ్యయన కేంద్రం. (ఐసిసి ఆర్వోఎం) జ్ఞపక చిహ్నాలు,
- కట్టడాలు ప్రదేశాల అంతర్జాతీయ కౌన్సిలు(ఐసిఓఎమ్ఓఎన్) -వీరందరూ భాగస్వాములుగా 1993లో ప్రపంచ వారసత్వ నగరాల సంస్థ (ఓడబ్ల్యూహెచ్‌సి)ఏర్పడింది.

## ప్రపంచ వారసత్వ నగరంగా ప్రకటిస్తే ప్రయోజనం ఏమిటి?

- ప్రపంచ వారసత్వ నగరంగా గుర్తిస్తే జాతికి గర్వకారణం, అదో గౌరవం.
- రోమ్, పారిస్, మాస్కో, వెనీస్ వంటి మహానగరాల సరసన, ప్రపంచ పటంలో మన నగరం కూడా చోటు చేసుకుంటుంది.
- అంతర్జాతీయ పర్యటనకు బ్రహ్మాండమైన ప్రోత్సాహం లభిస్తుంది.
- గుర్తింపు పొందిన ప్రదేశాలు, నగరాలు, అంతర్జాతీయ సంస్థలైన యునెస్కో, 'ఇక్రొమస్' అనే అంతర్జాతీయ వారసత్వ పరిరక్షణ, పునరుద్ధరణ సంస్థల నుండి ఆర్థిక, సాంకేతిక, శాస్త్రీయ కళాత్మక సహాయం పొందుతాయి.
- ప్రపంచ వారసత్వ హోదా వల్ల మన వారసత్వ సంపదకూ, సమాజానికి కూడా మేలుచేస్తుంది.
- స్థానికంగా అమూల్యమైన మన వారసత్వం గురించి పౌరులకు, విద్యార్థులకు అవగాహన కలిగించి వాటిని గురించి వారు గర్వపడేటట్లు, సంస్కృతిలోని శాశ్వతత్వాన్ని గురించి తెలుసుకునేందుకు వీలవుతుంది.
- వారసత్వాన్ని చక్కగా కాపాడుకోవడం వల్ల ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ కలిగే ప్రయోజనాలేకాక, సామాజిక సుస్థిరత కూడా సాధ్యమౌతుంది.



# హైదరాబాద్ వాస్తు శిల్ప వైభవం
# బహమనీ, కుతుబ్ షాహీ కాలం
# హైదరాబాద్ అవిర్భావం



చరిత్ర కాలగమనానికి సాక్షి. మాన మేధస్సుకీ, స్పందనకు ప్రతిబింబం. ప్రతి దశలో, ప్రతిదేశంలో జీవన సరళిని ప్రమాణ పత్రం. నిన్నటి నిజానికీ, నేటి నిజానికీ మధ్య వారధి. రేపటి వాస్తవాలను యీ రోజే కళ్ళ ఎదుట సాక్షాత్కరింప చేసే భవిష్యత్ దర్శిని. సమాజంలో గత అనుభవాలను, జీవనాన్ని, దేశ కాల పరిస్థితులను అర్థం చేసుకోవడానికే కాదు, రాబోయే రోజుల్లో ఎటువంటి పరిణామాలు కాగలరో కూడా సూచిస్తుంది చరిత్ర.

మనుష్యులు ముగిసిపోయి, ఎన్నో తరాలకు తెరపడి, మరెన్నో వేల ఏళ్ళు సంస్కృతులు కాలగర్భంలో కలిసిపోయాక చరిత్ర ఆనవాళ్ళు పట్టడం ఎలా? గడచిన శతాబ్దాల్లో సమాజం స్వరూపం తెలుసుకునేది ఎలా? ఈ పరిశోధనలో తోడ్పడే అతి ముఖ్యమైన వాటిల్లో ప్రాచీన కట్టడాలు, నగరాలు వున్నాయి.

మన చుట్టూ సమకాలీన అభివృద్ధితో పాటు అక్కడక్కడా నిన్నటి గుర్తులుగా. కాలం తాకిడి తట్టుకొని నిలబడ్డ వాస్తుశిల్పాలు ఎన్నో! నిలబడలేక కూలినప్పటికీ, చెక్కు చెదరకుండా చరిత్రను పదిలపరుచుకున్న శిథిలాలు ఎన్నో! ఈ శిథాలాల్లో, భవనాల్లో, చారిత్రక కట్టడాల్లో సజీవంగా మసలే చరిత్రను అధ్యయనం చేసి చరిత్రకారులు, శతాబ్దాలను పునర్నిర్మించారు.



## ప్రపంచ వారసత్వం

హైదరాబాద్, సికింద్రాబాద్ జంటనగరాలకు కూడా రమారమి 9 శతాబ్దాల చరిత్ర వుంది. 12వ శతాబ్దంలో హైదరాబాద్ నగరం ఆవిర్భావానికి ముందు ప్రారంభమైన చరిత్ర మిగిల్చిన కట్టడాలు, భవనాలు యీ నాడు అత్యాధునిక నగరంలో అనేక చోట్ల సముదాయాలుగా, ప్రాంగాలణాలుగా, కొన్నిసార్లు మొత్తం వీధులుగా దర్శనేమిస్తుంటాయి.



12వ శతాబ్దం నుంచి 16వ శతాబ్దంలో హైదరాబాద్ నగర నిర్మాణం వరకు దశను గోల్కొండ దశగా అభివర్ణించవచ్చు. మూసీనది ఒడ్డున వరంగల్ రాజులు ఉత్తర భాగంలో మట్టితో నిర్మించిన చిన్న కోటను గుల్బర్గాకి చెందిన బహమనీ రాజులు 1364లో ఆక్రమించుకున్నారు. ఈ కోటను/ బీదర్‌కీ, వరంగల్‌కీ మధ్య మార్గంలో, తూర్పు తీరంలో మచిలీపట్నం నుంచి ఔరంగాబాద్‌కి వ్యాపారమార్గంలో నిర్మించారు. కాకతీయ కోట వున్న స్థలంలోనే నిర్మించిన కొత్త కోటకు సుల్తాన్ కులీ గోల్కొండ అని పేరు పెట్టారిన ఒక వాదన వుండగా, సుల్తాన్ కులీ దానిని మహమద్‌నగర్ అని పిలిచారని మరొక నమ్మకం. ఏది ఏమైనా గోల్కొండ అనేది గొల్లకొండ అనే తెలుగు పదాల నుంచి వచ్చిందనేది అందరూ ఆమోదించే విషయం.

తుగ్లక్ ప్రతినిధులుగా దక్షిణ భారతదేశంలో బీదర్ కేంద్రంగా రాజ్యమేలిన బహమనీ సుల్తాన్‌లు, గోల్కొండను ఆక్రమించుకొన్న దరిమిల కోట అభివృద్ధికి సుల్తాన్ కులీని తమ ప్రతినిధిగా పంపారు. 15వ శతాబ్దం చివరి భాగంలో గోల్కొండకు వచ్చిన సుల్తాన్ కులీ, ఆ తర్వాత కులీకుతుబ్‌షా వంశస్థులు, బహమనీ రాజ్యం విచ్ఛిన్నమైన దరిమిలా గోల్కొండ కేంద్రంగా స్వతంత్రంగా రాజ్యం సాగించారు.



గోల్కొండ కోటను మూడు భాగాలుగా విభజించవచ్చును. భూతలం నుంచి 400

అడుగులు పైకి లేచిన బాలా హిస్సార్ కోటలోని అంతర్భాగం. ఈ భాగం చుట్టూ మైళ్ళ దూరం నుంచి ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ఆ వెలుపల మూడు మైళ్ళ చుట్టుకొలతలో వున్న పెద్దగోడకు ఎనిమిది భారీ ప్రవేశద్వారాలూ, 87 బురుజులు వున్నాయి. ప్రతి బురుజుకూ ఒక పేరు వుండడం విశేషం. మూడవది నయాకిలా. 1656లో మొగల్ రాజుల దాడి తర్వాత నిర్మించిన సముదాయం యీ నయాకిలా.



గోల్కొండ కోట నిర్మాణంలో ప్రముఖ పాత్ర సుల్తాన్ కులీదేనని చెప్పవచ్చును. పటిష్టమైన ద్వారాలు నిర్మిచండమే కాక, మొత్తం కట్టడం బలం పెంచడం తమ ప్రజలకోసం పెద్ద బజార్లు, స్నానాగారాలు నిర్మించడంలోనూ సుల్తాన్ కులీకి పాత్ర వుంది. ఆయన వేలాది మసీదులు కూడా నిర్మించారని తారీఖ్ ఏ మహమ్మద్ కుతుబ్ షా అనే పుస్తకంలో వున్నప్పటికీ, హైదరాబాద్‌లో జామా మసీదుగా రూపాంతరం చెందిన మస్జిదేసఫా మాత్రమే యిప్పటికీ నిలిచి వుంది. ఈ మసీదును కూడా బహమనీ సుల్తాన్‌లు ఆమోదించిన శైలిలోనే నిర్మించారు.

గోల్కొండ కోట కాక, షేక్‌పేట గ్రామం వద్ద కోటకు ఉత్తరదిశలో కుతుబ్‌షాహీ రాజుల సమాధులు కూడా సందర్శించదగ్గ కట్టడాలు. వాటి నిర్మాణా శైలి కూడా విలక్షణమైనది. వాటిల్లో కూడా సుల్తాన్ కులీ సమాధి ప్రత్యేకంగా చెప్పుకోవలసిన కట్టడం. 100అడుగుల నలు చదరపు వేదిక మీద, 30 అడుగుల చదరపు కట్టడంలో లోపల భాగం ఎనిమిది కోణాలు కలిగి వుంటుంది. 20 అడుగుల గోడపై నుంచి, మరో 20 అడుగుల ఎత్తున లేచిన వృత్తాకారపు డోమ్, యితర సమాధుల కంటె భిన్నంగా, సరైన కొలతలతో నిలిచి వుంటుంది.

సుల్తాన్ కులీ 1543లో మరణించగా, ఆయన వారసుడిగా వచ్చిన జమ్‌షీద్ కులీకుతుబ్‌షా కేవలం ఏడేళ్ళ పాటే పాలించారు. 1550లో మరణించిన జమ్‌షీద్ సమాధి, యితర సమాధుల్లోగే వున్నప్పటికీ ఎనిమిది పైపులతో నిర్మించిన యీ సమాధిలో, మొదటి, రెండో అంతస్తులను విడదీస్తూ నిర్మించిన బాల్కనీలు చెప్పుకోదగ్గవి. కట్టడానికి అన్ని వైపులా అతి సుందరంగా విస్తరించిన ఆర్క్‌లు కూడా వాస్తు శిల్ప సౌందర్యాన్ని చూపుతాయి. 1550 నుంచి 1580 వరకు ముప్ఫైఏళ్ళపాటు సుదీర్ఘంగా పాలించిన ఇబ్రహీం కులీకుతుబ్ షా గోల్కొండ కోట నిర్మాణానికి మరిన్ని కళలు తెచ్చారు. ఇబ్రహీం కుమారుడు మహమ్మద్ కులీకుతుబ్‌షాకే వాస్తుశిల్పంలో బాగా పేరు వచ్చినప్పటికీ, తండ్రి ఇబ్రహీమే తనకు దారి చూపాడనడంలో సందేహం లేదు.

కోటగోడలు పటిష్టపరచడం కోసం, గోడలోపలి భాగాన్ని మరిత విస్తృత పరచడం కోసం ఇబ్రహీం ఒక భారీ కట్టడాన్ని నిర్మించాడు. 3వేల గజాలు మేరకు సాగే యీ గోడ, యీనాటికీ హైదరాబాద్‌లో వున్న అతి వైభవోపేతమైన కట్టడాల్లో ఒకటి. మక్కాదిశగా వున్న మక్కాయి దర్వాజాతో సహా యీ గోడ నిర్మాణం. 1559-60 వరకు కొనసాగినట్లు తెలుస్తోంది. ఇబ్రహీం రాజభవనంలో ఆరు గదుల సముదాయాలు కాక, రాజమందిరం ఒకటి వుండేది. వెలుపలి గోడలో వున్న ఎనిమిది ద్వారాలతో పాటు, రాజప్రాసాదానికి దారి తీసే బాలాహిస్సార్ ద్వారం కూడా చెప్పుకోదగినది. 1578లో మూసీనదిపై ఇబ్రహీం నిర్మించిన వంతెనను అప్పట్లో నార్వా అనీ, యిప్పుడు పురానాపూల్ అని పిలుస్తున్నారు. 600 అడుగుల పొడవు, 36 అడుగుల వెడల్పు , నది నుంచి 42 నుంచి 56 అడుగుల ఎత్తు వున్న యీ వంతెన, 23 స్తంభాలపై నిలచి వుంది. ఇదికాక, గోల్కొండకి దక్షిణంగా ఇబ్రహీంబాగ్ అనే తోటలు, ఇబ్రహీం అల్లుడు హుస్సేన్ షావలీ తవ్వించిన హుస్సేన్‌సాగర్ చెరువు, బాలాహిస్సార్‌లో ఇబ్రహీం మసీదు, నయాఖిల్లాలో ముస్తఫాఖాన్ మసీదు, ముల్లా ఖాయాలీ మసీదు- ఇవన్నీ కూడా ఇబ్రహీం కాలంలో నిర్మించినవే. ఇది కాక 1580లో మరణించిన ఇబ్రహీం సమాధి మరో భారీకట్టడం.

హైదరాబాద్ ప్రాంత చరిత్రలో రెండవ దశను హైదరాబాద్ దశగానే అభివర్ణించవచ్చు. గోల్కొండ గోడల మధ్య వున్న నగరం కనుక, అక్కడకు వచ్చి నివసించే జనాభా పెరిగిపోవడం వల్ల, తిలాంగ్ రాజుల పాలన ఘనత విని, దేశంలో అనేక ప్రాంతాల నుంచి ప్రజలు వలస రావడం వల్ల ఇరుకు అనిపించి, ఇబ్రహీం కాలంలోనే రాజధానిని విస్తరించాలని నిర్ణయించారు. గోల్కొండకి ఉత్తరంగానో, పశ్చిమంగానో రాజధాని నగరం నిర్మిద్దామనీ ఇబ్రహీం వేసిన ప్రణాళిక నీరు లేక భంగమైంది. ఈ లోపుగా 1578 పురానాపూల్ నిర్మించేటప్పటికి, మూసీనదికి ఉత్తరంగా వున్న గోల్కొండ నుంచి నది దాటి దక్షిణంగా రాజధాని నిర్మించవచ్చని తెలిసింది. 1590లో కొత్తనగరం నిర్మాణానికి ప్రణాళికలు సిద్ధమైనాయి. కొత్త రాజధానికోసం 'ప్రపంచంలో యింకెక్కడా లేని విధంగా, భూమిపై స్వర్గధామాన్ని తలపించేటట్లుగా ప్రణాళికలు తయారు చేయాలని' మహమ్మద్ కులీ సుల్తాన్ వాస్తు శిల్పులను ఆదేశించాడట.

గోల్కొండకి తూర్పువైపున మచిలీపట్నం వరకు రహదారి వుండనే వుంది. దక్షిణ దిశగా చార్మినార్ నిర్మాణంలో కొత్త రాజధానికి పునాదులు పడ్డాయి. 1591-92 సంవత్సరాల్లో పూర్తయిన నాలుగు స్తంభాలు, నాలుగు ఆర్కుల చార్మినార్ నుంచి, నలుదిశల్లో సువిశాలమైన రోడ్లు నిర్మించారు. నాలుగు వైపులా సుమారు 110 గజాల దూరంలో, 50 అడుగుల ఎత్తు వున్న గేట్లు నిర్మించారు. అప్పట్లో జీతాఖానా అనే యీ ద్వారాలను యిప్పుడు చార్ కమాన్ అంటే నాలుగు ద్వారాలు అని పిలుస్తున్నాం.

కూడలి నుంచి పశ్చిమ దిశలో మూసీ వరకు విస్తరించి వున్న రాజప్రాసాదానికి ఒక రహదారి వెళ్ళగా, కూడలిలో చానాసూకా హూజ్ అనే పెద్ద నీటి యంత్రం ఏర్పాటు చేశారు. కొత్త నగరంలో ప్రధాన ప్రణాళిక పూర్తి కాగానే సుల్తాన్, రహదారులకు అటూ యిటూ 14వేల దుకాణాలు, పాఠశాలలు, మసీదులు, సత్రాలు, స్నానాగారాలు నిర్మించాలని ఆదేశించారు. ఇవన్నీ సిద్ధమైనాక, కొత్త రాజధాని నగరం హైదరాబాద్‌కి మారింది.

ప్రధాన రాజప్రాసాదాలే కాక మహమ్మద్ కులీ, మూడు భారీ ప్రాసాదాలు కూడా నిర్మించాడు. వీటిలో ఒకటి నదీ మహల్ అని మూసీ ఒడ్డున, రెండవది నౌబల్ ఘాట్ నుంచి ఫలక్‌నామా అని కొండపై నిర్మించారు. నౌబత్ ఘాట్ నుంచి ఫలక్‌నామా వరకు పచ్చగా కళకళలాడుతూ తోటలు, ఉద్యానవనాలు వుండేవి. వైభవోపేతమైన భవనాలు యీ తోటల మధ్యలో వుండేవి. అలనాటి నుంచి వున్న తోటల్లో మనకి యీనాడు తెలిసిన బాగ్‌లింగంపల్లి తోట కూడా వుందంటే ఆశ్చర్యం అనిపిస్తుంది కదూ!

1591 నుంచి 1687 మధ్య సంవత్సరాల్లో నలుగురు రాజుల ఆధ్వర్యంలో హైదరాబాద్‌లో ప్రముఖ కట్టడాలన్నీ రూపుదిద్దుకున్నాయి. అన్నింటికంటె ప్రముఖమైనది చార్మినార్ నిర్మాణం 1591-92 సంవత్సరాల్లో పూర్తి కాగా, జామా మసీదు నిర్మాణం 1597-98 సంవత్సరాల్లో పూర్తయింది. 60 అడుగుల ఎత్తు, 36 అడుగుల వెడల్పు వున్న చార్ కమాన్లలో ఒక ద్వారం రాజభవనాలకు దారి తీసేది. తూర్పువైపు గేటుపై సంగీతకారులు కూర్చుని షెహనాయి వాయించేవారట. ఉత్తర, దక్షిణ ద్వారాల వద్ద సైనికులు కాపలా వుండేవారు.

రాచరికపు వైభవానికి నిదర్శనంగా ఎన్నో భవనాలు నగరంలో విలసిల్లాయి. వాటిల్లో కొన్ని యిప్పటికీ వున్నాయి. ప్రభుత్వ పత్రాలు పెట్టే రికార్డు కార్యాలయం, వస్త్రాలు, దుస్తులు భద్రపరచిన జమాదార్ ఖానా, కార్ఖానాలు, రాజు సేవకుల కోసం లాల్‌మహల్ చందనంతో నిర్మించిన చందన్ మహల్, టర్కీ దేశస్థులు, అరబ్బులు, దఖ్ఖనీలు, వున్న సజన్ మహల్, పండితుల కోసం ఖాస్‌మహల్ యివన్నీ రాచరికపు జీవనం విస్తరించిన ప్రాంగణాలే. అన్నింటికంటె ప్రధానమైనది ఖుదాదాద్ మహల్. 1610లో నిర్మించిన యీ రాజభవనం అతి పెద్దది. 7,8 అంతుస్థుల యీ భవనంలో రాచకుటుంబం నివసించేది.

మహమద్ కులీ హయాంలోనే ఇమామ్ హుస్సేన్ మోసినట్లుగా చెప్పే ఆలంల ప్రతులు వున్న బాద్‌షాహీ అఘూర్ ఖానా, దారుల్ ఫిషా ఆసుపత్రి, యునానీ కళాశాల, సరాయ్ నిమతుల్లా అనే సత్రం, సైదాబాద్,

మీర్‌పేట మసీదులు కూడా నిర్మించారు.

ఇవన్నీ ఒక ఎత్తైతే, మహమ్మద్ కులీ కళాత్మక దృష్టి ఆయన మరణానంతరం, స్వయంగా ఆయన సమాధిలోనే పూర్తిగా ప్రస్ఫుటమౌతుంది. 18 అడుగుల ఎత్తున్న గట్టుపై నిర్మించిన యీ సమాధి క్రింది అంతస్తు 200 చదరపు అడుగులు, పైన 126 చదరపు అడుగులు వుంటుంది. అన్ని సమాధుల్లోకి ఎత్తుగా, విలక్షణమైన అనేక వాస్తు శిల్ప లక్షణాలతో యిది సగర్వంగా, మహమ్మద్ కులీకి శ్రద్ధాంజలిగా నిలిచి వుంటుంది.

1612 నుంచి 1626 వరకు పాలించిన సుల్తాన్ మహమ్మద్ కుతుబ్‌షాకి వాస్తుశిల్పం, నిర్మాణం కంటె సాహిత్యం అంటే మక్కువ ఎక్కువ. అయినప్పటికీ ఆయన కూడా కొన్ని ప్రముఖ భవనాలను నిర్మంచాడు. వీటిల్లో విశేషంగా చెప్పుకోవలసినది మక్కామసీదు. 1614లో ప్రారంభమైన యీ నిర్మాణం, చివరి యిద్దరు కుతుబ్‌షాహీ రాజుల కాలంలో కొనసాగి, ఔరంగజేబ్ హైదరాబాద్ ఆక్రమించిన చాలా కాలానికి 1692లో పూర్తయింది. పెద్దగా అలంకారాలేవి లేని యీ మసీదు నిర్మాణంలో రాళ్ళు కొట్టేవాళ్ళు 2వేల మంది, తాపీ మేస్త్రీలు 2వేల మంది, కూలీలు 4వేల మంది పాల్గొన్నారు.

మహమ్మద్ కుతుబ్‌షా చార్మినార్‌కి 85మైళ్ల దూరంలో సుల్తాన్ నగర్ అనే కొత్త రాజధానిని నిర్మించినప్పటికీ, ఆయన మరణించాక ఆ నగరం పాడుబడిపోయింది. తన కుమార్తె ఖైరతున్నీసాబేగం పేరు మీద ఆమె గురువు ముల్లా అబ్దుల్ మాలిక్ కోసం రాజు ఖైరతాబాద్ మసీదు నిర్మించాడు. ఖైరతాబాద్ మసీదు నుంచి రెండు మైళ్ళ దూరంలో మహమ్మద్ తన తల్లి గౌరవార్థం తవ్వించిన చెరువు మా సాహెబ్‌కా తాలాబ్, యీ రాజు మనకి తెలిసి మాసాబ్‌ట్యాంకే. అయితే అప్పుడు చెరువు వున్న స్థలంలో యిప్పుడు తోట వచ్చింది. మంచి ఆసనాల అప్పట్లో నిర్మించిన రెండు టవర్లు యిప్పుడు కనుపించవు. ఇక, సల్తాన్‌ల సంప్రదాయం ప్రకారం సల్తాన్ సమాధి సరేసరి.

మహమ్మద్ కుతుబ్‌షా తర్వాత 1626 నుంచి 1672 వరకు పాలించిన అబ్దుల్లా కుతుబ్‌షా హయంలోనే 1656లో హైదరాబాద్‌పై దాడులు జరిగాయి. ఈ దాడి తర్వాత గోల్కొండ తిరిగి వెళ్ళిపోయిన అబ్దుల్లా కుతుబ్‌షా, ఆ కోటలోనే

కొనసాగడం, గోల్కొండ  పాత రాజధానిగా కోల్పోయిన వైభవాన్ని కొంత మేరకు తిరిగి పొందగలిగింది. అబ్దుల్లా కుతుబ్‌షా హయత్‌నగర్ మసీదును, సత్రాన్ని నిర్మించడంతో పాటు, బాద్‌షాహీ            హంగులు చేర్చారు. అబ్దుల్లా తల్లి హయత్‌బక్షీబేగం 1625-26 సంవత్సరాల్లో హయత్‌నగర్ ప్రాంతాన్ని స్థాపించారు. ఇప్పుడు ఆ సముదాయంలో అతి కొద్ది భవనాలు మిగిలివున్నాయి.

అబ్దుల్లా కాలంలోనే షేక్‌పేట గ్రామం, షేక్‌పేట మసీదుతో పాటు ఎన్నో మసీదుల నిర్మాణం జరిగింది. వీటిల్లో రహీంఖా మసీదు, కుల్సుం బేగం మసీదు, టోలీమసీదు, మీర్‌జామా చెరువు ఒడ్డున రెండు మసీదులు, తారామతీ, ప్రేమమాలి మసీదులు ప్రముఖమైనవి. వీటన్నింటిలోకి టోలీ మసీదు అత్యంత అద్భుతమైన శైలిలో నిర్మించింది కాగా, తారామతీ బారా ప్రేమామతి మసీదులను పునరుద్ధరించి రాష్ట్రప్రభుత్వం, సాంస్కృతిక కార్యక్రమాలకు వేదికగా ఉపయోగిస్తోంది.

1656లో గోల్కొండపై మొగల్ రాజుల దాడి జరిగిన దరిమిలా నయాఖిల్లా నిర్మించారు. కోటకి పటిష్టంగా వుండే బురుజులు నిర్మించడంతో పాటు ఒక కందకం తవ్వించారు. 1656లో ఔరంగజేబ్ తుపాకులు, శత్రువులను గురిపెట్టిన ఉత్తన దిశ వున్న గోడ నుంచి నయాఖిల్లా కట్టారు. మొగల్ సంప్రదాయంలో నీటి కాలువతో నయాఖిల్లాలో పెద్ద తోట కూడా వుండేది. అంతేకాక, గోల్కొండ వెలుపల 1668లో హీరా మసీదు కట్టడం 1656లో హైదరాబాద్ విడిచి గోల్కొండ పారిపోయిన అబ్దుల్లా కుతుబ్‌షా మరెన్నో కట్టడాలను మరమ్మత్తు చేశాడని కూడా చెప్తారు. ఇక సమాధుల విషయానికొస్తే తన తల్లి హయత్ బక్షీ సమాధికి 1667లో కట్టించి అబ్దుల్లా, అదే ఏడాది అక్కడే ఒక మసీదు కూడా నిర్మించాడు. అ తర్వాత 1672లో హయత్ బక్షీ బేగం సమాధి మాదిరిగానే అబ్దుల్లా సమాధి కూడా నిర్మించారు.

1672లో అబ్దుల్లా మృతి తర్వాత రాజైన అబుల్‌హసన్ తానాషా. 1687 వరకు రాజ్యమేలాడు. చివరి కుతుబ్ రాజైనా అబుల్‌హసన్ కాలంలో ఎన్నో సంక్షోభాలు, సమస్యలు వచ్చి, కుతుబ్‌షాహీ వంశం రమరమి అంతమైనప్పటికీ తన హయాంలో అబుల్‌హసన్ కొన్ని విలక్షణమైన భవనాలు నిర్మించాడు. గోషామహల్ వీటిల్లో చెప్పుకోదగినది. ఈ భవన సముదాయానికి యీ పేరు ఎందుకు వచ్చిందో స్పష్టంగా తెలియరాలేదు. ఘోషా లేదా పర్దాలో వుండే స్త్రీలకోసం అయివుండవచ్చుననీ లేదా గోషా అనే గ్రామంలో నిర్మించారనీ కథనాలు వినవస్తుంటాయి. 100 పెద్ద గదులు వున్నట్లుగా భావించే యీ పెద్ద భవంతిలో కొంత భాగం మాత్రం ప్రస్తుతం మిగిలి వుంది. అలాగే మూసీ ఒడ్డుపై నిర్మించిన చార్‌మహల్ అనే ప్రాసాదం ఆనవాళ్ళు కూడా యిప్పుడు లేవు. పురానాపూల్ చివర మియామిష్క్ సమాధజ, అత్తాపూర్‌లో మిమామిష్క్ మహన్, ముషీరాబాద్ మసీదు, షతేదర్వాజా వెలుపల వున్న షారాజు సమాధి, అక్కన్న మాదన్న ఆలయాలు చెప్పుకోదగ్గవి. మైసారా వద్ద శివుడి ఆలయాన్ని కూడా అబుల్‌హసన్ నిర్మించాడు.

అబుల్‌హసన్ తానాషాతోనే కులీకుతుబ్‌షా వంశం పరిసమాప్తమైంది.

**హైదరాబాద్ వాస్తు శిల్ప వైభవం - మొగల్, అసఫ్‌జాహీ కాలాలు**

కుతుబ్‌షాహీ రాజుల్లో చివరి వాడైన అబుల్ హసన్ తానాషా అధికారంలో వుండగానే మొగల్ చక్రవర్తి ఔరంజేబు నాయకత్వంలో మొగల్ సైన్యం దాడి జరిగింది. మొదటిసారి అబ్దుల్లా కుతుబ్ షా పాలిస్తున్న కాలంలో దాడి జరిపిన మొగల్ సైన్యం, శాంతి ఒప్పందం చేసుకొని వెనుతిరిగింది.

అయితే, మళ్ళీ 1687లో గొల్కొండ పై కన్ను వేసిన మొగల్ చక్రవర్తి మే 16వ తేదీ రాత్రి కోట గోడ పైకి ఎగబాకవలసిందిగా తన సైన్యాన్ని ఆదేశించాడు. అంతకు ముందే కుట్ర పన్నిన చక్రవర్తి బీరర్ నుంచి 50వేల పత్తి బస్తాలను తెప్పించి వాటిలో మన్ను నింపి కందకాన్ని మూయించివేశాడు. చక్రవర్తి స్వయంగా మొదటి బస్తాను తోయడం ద్వారా, దాడికి శ్రీకారం, చుట్టాడు. అంతా సిద్ధం చేసుకొన్న మొగల్ సైన్యం రాత్రి చీకటిలో రహస్యంగా అక్కడికి చేరుకొని దాడికి సిద్ధమైంది. గోడపైకి మోకాలను బిగించారు. నిదానంగా పైకి ఎక్కడం ప్రారంభించారు.

హైదరాబాద్ చరిత్రలో ఆసక్తి కలిగించే సంఘటనల్లో ఒకటి అప్పుడు జరిగింది, ఆ ప్రాంతంలో వున్న ఊరకుక్క ఒకటి, ఉడుముల్లా, ఉడుతల్లా పైకి పాకుతున్న మొగల్ సైనికులను చూసి కంగారు పడి, మొరగడం ప్రారంభించింది. దీనితో కోటకి కాపలా వున్న సైనికులు అప్రమత్తమైనారు. వాళ్ళు తాళ్ళను కోసివేసి మొగల్ సైనికులను తరిమి తరిమికొట్టారు. దీనితో మొగల్ దాడితో రెండవ ప్రయత్నం భంగమైంది.

అయితే, ఆ కథ అక్కడ ఆగలేదు. 1687లోనే సెప్టెంబర్ 21వ తేదీన అంటే కేవలం నాలుగు నెలల తర్వాత, మొగల్ దాడికి ప్రయత్నించారు. ఈ సారి చాలా విషాదకరంగా, కోటలోపలి వారి నమ్మక ద్రోహం వల్ల గోల్కొండ వైభవం ఆకస్మికంగా ముగిసిపోయింది. 1687 సెప్టెంబర్ 21న మొగల్ సైన్యాలు రహస్యంగా చొరబడేందుకు వీలుగా అబ్దుల్లా ఖాన్ అనే సేనాపతి పాత కందకం వద్ద కిటికి ద్వారాన్ని తెరచివుంచాడు. దీనితో ద్వారంలోకి రాత్రి ప్రవేశించిన మొగల్

సైనికులు ఫతే దర్వాజాను తెరచి ఎన్నో దశాబ్దాలుగా బయటవారికి ప్రవేశం లేని రహదారిపై విజయగర్వంతో అడుగులు వేశారు. రహూల్లాఖాన్ నేతృత్వంలోని మొగల్ సైన్యం గోల్కొండ కోటలో అడుగిడగా, యువరాజు ఆజం బాలాహిసార్ దర్వాజా ఎదుట మైదానంలో వేచియున్నాడు.

ఈ విధంగా 1687లో మహాకట్టడమైన గోల్కొండ తన రాచరిక వైభవం కోల్పోయి, మొగల్ స్వాధీనమైంది. ఎనిమిది నెలల పాటు అవిశ్రాంతంగా ప్రయత్నించిన శత్రుసేనలు, చివరకు గోల్కొండ ఉప్పు తిన్న అధికారి అనైతికత వల్ల విజయం సాధించగలిగారు.

ఆ తర్వాత మొగల్ రాజులకు గోల్కొండలో ఆసకిపోయింది. వారు ఔరంబాద్‌లో తమ రాజధాని ఏర్పాటు చేసుకున్నారు. దీనితో సహజంగానే హైదరాబాద్ ప్రాభవం కూడా పేలవమైపోయిందిజ దక్కన్ సుబాహ్ అధీనంలో ఔరంగాబాద్ అన్ని కార్యకలాపాలకు కేంద్రంగా ఆవిర్భవించింది.

సుల్తాన్ మహమ్మద్ కుతుబ్‌షా కాలంలో 1614లో ప్రారంభమైన మక్కామసీదు నిర్మాణం 80 సంవత్సరాల సుదీర్ఘ కాలం పాటు సాగి; చివరకి ఔరంగజేబు హయంలో 1693లో ముగిసింది. ఔరంగజేబు హస్తం పడ్డాక, యీ మసీదు నిర్మాణ శైలిలో కొంత మార్పు వచ్చింది. అద్దంలా తళతళలాడే చలవరాయి ఫలకాలు పరచడం యీ మార్పుల్లో ప్రధానమైంది. దక్కన్ ప్రాంతం మొత్తంలో వున్న మసీదులన్నింటిలోకి మక్కామసీదు అత్యంత అద్భుతమైన కట్టడం. ఈ దశలో గోల్కొండ స్తబ్దత నెలకొన్న కొన్ని దశకాలకు 1712లో ఔరంగజేబు నిజామ్ ఉల్‌ముల్క్ ఆసఫ్‌జాను దక్కన్ రాష్ట్ర సుబేదారుగా నియిమించారు. ఎంతో అనిశ్చిత నెలకొన్న రాజకీయ వ్యవస్థను తన నియంత్రణలోకి తెచ్చుకొని నిజామ్ 1725లో అసఫ్ జాహీ వంశాన్ని నెలకొల్పారు.

1725 నుంచి 1793 వరకు కాలాన్ని అసఫ్ జాహీ కాలంలో తొలిదశగా అభివర్ణించవచ్చు. 1712లో వైస్రాయ్ నియతుడైన నిజామ్ ఉల్ ముల్క్ అసఫ్‌జా, 1725లో పూర్తి స్వయం ప్రతిపత్తి పొందారు. అసఫ్ జాహీ వంశ వ్యవస్థాపకుడైన మొదటి నిజామ్ ఔరంబాద్‌నే రాజధానిగా కొనసాగించారు.

ఈ దరిమిలా హైదరాబాద్‌కి మకాం మార్చిన నిజామ్ మొదటిసారిగా నగరం చుట్టూ 13 ద్వారాలతో గోడలు నిర్మించి, నగరాన్ని వాల్‌డ్ సిటిగా మార్చారు. 1591లో ఆవిర్భవించిన నాటి నుంచి, 130 సంవత్సరాల పాటు నగరానికి రక్షణగా గోడలు లేనేలేవు. తమ సైనిక సామర్థ్యంలో తమ ఆయుధాల్లోనూ, గోల్కొండ కోట పటిష్టతలోనూ అపారమైన విశ్వాసం కల కుతుబ్‌షాహీ రాజులు, ఈ తర్వాత మొగల్ రాజులు నగరం చుట్టూ గోడలు అనవసరమని భావించారు. అయితే, మరాఠాలు కొన్నేళ్ళకు / మెల్లిగా గోల్కొండ పరిధిలోకి చొచ్చుకొనే ప్రయత్నం చేయడంతో, గోడ అవసరం పడింది. 1724లో మొగల్ గవర్నర్ నుంబారీఖాన్ గోడ నిర్మాణం ప్రారంభించారు. మొదటి నిజామ్ కాలంలో, రెండున్నర మైళ్ళ పొడవున్న యీ గోడలో 14 గేట్లు, నాలుగు ఖిడికీలు వున్నాయి. ఈ గేట్లన్నింటికీ పేర్లు వుండడం విశేషం. చాదర్‌ఘంట్, ఢీల్లీ, అఫ్జల్, చంపా, చార్‌మహల్,

పురానాపూల్, అలియబాద్, గౌలీపూర్, ఘాన్సీ, మీర్‌జామ్లా, యాకుత్‌పురా, డబీర్‌పురా, ఫతేదర్వాజా అన్నవి యీ గేట్ల పేర్లు. ఈనాడు యీ గోడలో చిన్న భాగాలు శిథిలావస్థలో మిగిలాయి.

1748లో మొదటి నిజామ్ మరణించడంతో వారసుడి ఎంపిక కోసం పోరాటం ప్రారంభమైంది. 1750లో ఫ్రెంచ్, బ్రిటన్ వలసరాజులు యీ పోరాటానికి మద్దతు యిచ్చారు. ఈ రెండు వలస వర్గాల మధ్య కూడా జరిగిన పోరాటం 1763లో ముగిసింది. రాజధాని ఔరంగాబాద్ నుంచి హైదరాబాద్‌కి మారిపోవడంతో హైదరాబాద్‌ని మరోసారి పునరుజ్జీవింపచేసింది.

అసఫ్ జాహీ కాలంలో తొలిదశలో సుమారు 75 సంవత్సరాల కాలాన్ని రెండుగా విభజించవచ్చు. మొదటిది 1725 నుంచి 1763 వరకు ఔరంగాబాద్ నుంచి హైదారాబాద్‌కు పూర్తిగా రాజధాని కేంద్రం మారే కాలం- దీనిని మార్పు దశగా వర్ణించవచ్చు. రెంవడది వేగదశ 1763-1798 మధ్య కాలంలో హైదరాబాద్ అభివృద్ధి అతి త్వరితగతిన జరిగింది.

మార్పు దశలో హైదరాబాద్ ఆర్థికంగా చాలా సంక్షోభం ఎదుర్కొందనే చెప్పాలి. ఎందుకంటే ఔరంగాబాద్‌కి అనేక మంది ధనికులైన భూస్వాములు వలస వెళ్ళడంతో, సౌభాద్యకమైన కార్యకలాపాలన్నీ అక్కడే జరిగాయి.

1748లో మొదటి అసఫ్ జా మరణంలో, బ్రిటిష్, ఫ్రెంచి వర్గాల మధ్య అధికార పోరాటం వల్ల కూడా రాజకీయ అనిశ్చిత ఏర్పడి, హైదరాబాద్ అబివృద్ధి కుంటుపడింది. అదే సమయంలో రాజభవనాలు, మంత్రులు ప్రాసాదాలు ఎన్ని కట్టినా కూడా నగరంలో నెలకొన్న స్తబ్దత పోనే లేదు. నగరంలో సగభాగంలో మాత్రమే జనావాసాలు వుండేవి. ధనికులు యిళ్ళు అనేకం పాడుబడిపోయాయి. ఈ కాలంలోనే అంటే 1750లో హైదరాబాద్‌లోని రాజప్రాసాదాల్లో అత్యంత సుందరమైన చౌమహల్లో భవనాన్ని నిర్మించారు. అసఫ్ జాహీ రాజప్రాసాదాల్లో యిది మొదటిది. నాలుగా భవనాల యి సముదాయంలో మధ్యలో అతి సుందమైన ఉద్యానవనం వుండేది. చార్మినార్ సమీపంలో లాడ్‌బజార్ గుండా జీతాఖానా లేనే కూడలి గుండా చౌమహల్లా ప్రవేశం వుండేది.

దక్కన్ నిజామ్, నిజామ్ అలీ ఖాన్ హైదరాబాద్‌కి కేంద్రం మార్చాక దశ

తిరిగింది. ఉత్తర భారతం వైపు కంటే, దక్షిణ దిశగా తనకి ఎక్కువగా శక్తి అధికారం సిద్ధస్తాయని నిజామ్ గ్రహించడంతో, రాజధాని మళ్ళీ మారింది. 1763 నుంచి హైదరాబాద్ నగరం 76 ఏళ్ళుగా పోగొట్టుకున్న కళను తిరిగి సాధించి కళకళలాడింది. రాజధాని మారేటప్పటికి, ధనికులు, పెద్ద మనుష్యులు, రాజ వంశస్థులు కూడా హైదరాబాద్‌కి బదిలీ అయ్యారు. వాణిజ్యం, ఆదాయం, నిర్మాణం అన్నీ పెరిగాయి. నగరం గోడల మధ్య పట్టణ ప్రాంతాల పునరుజ్జీవనం జరిగి, శిధిలాలు పూర్వవైభవాన్ని సంతరించుకున్నాయి. గోడలు దాటి, ముఖ్యంగా దక్షిణ దిశలో ఆవాసాలు పెరిగాయి. 1763లో ఒక పెద్ద బజారు వుండగా, 1798 కల్లా యిది కూడా బజార్లకు పెరిగి వాణిజ్యం, వ్యాపారం విలసిల్లాయి

నగరంలో ప్రధాన ప్రాంతాలు తూర్పు నుంచి పశ్చిమానికి విస్తరించినప్పటికీ, 1798 ముగిసే సమయానికి చార్మినార్ అతి ముఖ్యమైన వాణిజ్య కేంద్రంగా ఉద్భవించింది.

మనకి యీ నాడు తెలిసిన బేగం బజార్, కార్వాన్ ప్రాంతాలు అభివృద్ధి అయ్యాయి. 1777లో రెండవ నిజామ్ తన కుమారుడి కోసం ఒక పెద్ద భవన సముదాయాన్ని కొనుగోలు చేశాడు. మూడవ నిజామ్ ఆ తర్వాత ఖల్వత్ చౌమొహల్లాకి మకాం మార్చడంతో,తండ్రి ఆయన కోసం కొన్న భవనాన్ని పురానీహవేలీ అనడం ప్రారంభించారు. 1803లో మూడవ నిజామ్ సికందర్ జా, నిజామ్ పదవి చేపట్టాక ఎన్నో సంవత్సరాలు ఖాళీగా వున్న పురానీ జవేలీలో అయిదవ నిజామ్ అఫ్జలుద్దౌలా నివసించడం ప్రారంభినాడు. 1798లో జరిగిన అతి కీలకమైన రెండు ఘటనల వల్ల హైదరాబాద్ భవతవ్యం మారిపోయింది. రాజకీయ, సామాజిక రంగాల్లో మార్పులతో పాటు, వాస్తు శిల్పంలో భవన నిర్మాణంలో పట్టణ ప్రాంతాల స్వరూపంలో అనేక మార్పులు వచ్చాయి. దీనితో అసఫ్ జాహీ కాలంలో తొలి దశకి తెరపడి నిజామ్ బ్రిటిష్ రెసిడెంట్ల హయాం, సికింద్రాబాద్ దశ ప్రారంభమైంది.

హైదరాబాద్ వాస్తుశిల్పవైభవం- నిజమా హయాం - బ్రిటిష్ రాజ్యం - సికింద్రాబాద్ ఆవిర్భావం

ఔరంగాబాద్ నుంచి హైదరాబాద్‌కి రాజధాని మరోసారి మారడంతో జీవకళ ఉట్టిపడతు, పదహారు వన్నెలతో కొత్త సొగసు దిద్దుకున్న హైదరాబాద్ నగరం భవితవ్యం 1798లో జరిగిన రెండు అతి కీలకమైన రాజకీయ పరిణామాలతో, నిర్ణయాలతో శాశ్వతంగా మరిపోయింది. 1798లో నిజామ్‌కీ, ఈస్ట్‌యిండియా కంపెనీకి మధ్య కుదిరిన అనుబంధ ఒప్పందంతో సికింద్రాబాద్ ఏర్పడి, హైదరాబాద్ అభివృద్ధిలో కొత్త పోకడలు వచ్చాయి. రెండో పరిణామం - మూసీనది ఉత్తర దిశలో ఒడ్డున బ్రిటిష్ రెసిడెన్సీ నిర్మాణానికి నిజామ్ అనుమతి యివ్వడం. బ్రిటిష్ రెసిడెన్సీ- అంటే హిందీలో కోఠీ- పెద్ద భవనంగా వ్యవహరించిన భవన సముదాయంలో ప్రస్తుతం ఉస్మానియా విశ్వవిద్యాలయానికి చెందిన మహిళ కళాశాల వుంది. అప్పటి విస్తారమైన, విలాసవంతమైన

ప్రాంగణాలు కుంచించుకుని పోయి, యిప్పుడు 40 ఎకరాల్లో యీ భవంతులు రాచరికపు సౌందర్యం ఏ మాత్రం తగ్గలేదనే చెప్పాలి.

బ్రిటిష్ రెసిడెంట్ - అంటే నరగంలోనే నివాసం వుండి పాలించే అధికారికి నిజామ్ ప్రభుత్వం అపరిమితమైన అధికారం, పౌర, నేర విచారణ విషయాల్లో విస్తృతమైన పరిధి కల్పించింది. బ్రిటిష్ రెసిడెన్సీ చుట్టూ అనేక దుకాణాలు, రెసిడెన్సీ సిబ్బంది నివాసాలు వచ్చాయి. ఈ ప్రాంతంలో బ్రిటిష్ రెసిడెంట్ అధికారం వున్న పరిధిలో శాంతి, భద్రతలకి భిన్నంగా, మిగిలిన హైదరాబాద్‌లో పరిస్థితి అస్తవ్యస్తంగా ఉండేది. ముఖ్యంగా సరిహద్దు ప్రాంతాల్లో నేరాలు కూడా బాగా జరిగేవి. దీనితో అనేక మంది వ్యాపారులు, బ్యాంకర్లు చాదర్‌ఘాట్ ప్రాంతం వచ్చి చేరారు. వీరొక పక్క వుండగా, యూరోపియన్లు, యురేనియన్లు రెసిడెన్సీ సమీపంలో ఉండదలచి నిర్మించిన ప్రాంతాలు, హైదరాబాద్ సాంస్కృతిక, వాస్తు శిల్పాభివృద్ధిలో అతి ముఖ్యమైనవి.

రెసిడెన్సీకి కొన్ని కిలోమీటర్ల దూరంలో ఆయుధాగారామైన గన్‌ఫౌండ్రీ చుట్టూ ఫ్రెంచి దేశస్థులు నిర్మించుకున్న యిళ్ళు, వాస్తు శిల్ప స్వరూపానికి విలక్షణత తెచ్చిపెట్టాయి. యూరోపియన్ శైలిలో యిళ్ళూ, క్రైస్తవ చిర్చులు, కాన్వెంట్ పాఠశాలలు అప్పటి నుంచి యిప్పటి వరకూ కొనసాగుతున్నాయి. రెసిడెన్సీ ప్రాంతలో అప్పటికీ వూపు అందుకున్న కార్యకలాపాలు 1839లో చాదర్‌ఘాట్, 1857లో అఫ్జల్‌గంట్ వంతెనల నిర్మాణంలో మరింత ఉధృతమైనాయి. ముఖ్యంగా అఫ్జల్‌గంజ్ వంతెన నిజామ్ ప్రాసాదాలకు, బ్రిటిష్ రెసిడెన్సీకి మధ్య రాకపోకలకు వీలు కల్పించింది.

ంసిడెన్సీకి కొన్ని కిలోమీటర్ల దూరంలో ఆయుధాగారామైన గన్‌ఫౌండ్రీ చుట్టూ ఫ్రెంచి దేశస్థులు నిర్మించుకున్న యిళ్ళు, వాస్తు శిల్ప స్వరూపానికి విలక్షణత తెచ్చిపెట్టాయి. యూరోపియన్ శైలిలో యిళ్ళూ, క్రైస్తవ చిర్చులు, కాన్వెంట్ పాఠశాలలు అప్పటి నుంచి యిప్పటి వరకూ కొనసాగుతున్నాయి. రెసిడెన్సీ ప్రాంతలో అప్పటికీ వూపు అందుకున్న కార్యకలాపాలు 1839లో చాదర్‌ఘాట్, 1857లో అఫ్జల్‌గంట్ వంతెనల నిర్మాణంలో మరింత ఉధృతమైనాయి. ముఖ్యంగా అఫ్జల్‌గంజ్ వంతెన నిజామ్ ప్రాసాదాలకు, బ్రిటిష్ రెసిడెన్సీకి మధ్య

రాకపోకలకు వీలు కల్పించింది.

ఈ కాలంలో హైదరాబాద్‌లో నిర్మంచిన భవనాల్లో రెసిడెన్సీ అతి ప్రముఖమైనదని వేరే చెప్పనవసరం లేదు. 18వ శతాబ్దం చివరి భాగంలో బ్రిటిష్ సామ్రాజ్యదూతలు హైదరాబాద్‌కి వచ్చినప్పుడు వారిని నవాబ్ షంషేర్ గంజ్ తోటలో బస చేయించేవారు. ఆ తర్వాత యీ దూతలు శాశ్వత ప్రాతిపదికన వుంటూ రెసిడెంట్లూ మారారు. వారిలో ప్రముఖులు విలియం కర్క్‌పాట్రిక్, సోదరుడు జేమ్స్ కర్‌కరపాట్రిక్, జేమ్స్ కర్‌కకపాట్రిక్ తన దివాను కుమార్తె ఖైరున్నీబేగంను వివాహం చేసుకొన్నాడు. వారి ప్రేమకథ అజరామరం, చిరస్మరణీయం. ఎంతో స్వల్పకాలం జరిగి, ముగిసిపోయిన ఆ ప్రేమ గాథ సౌరభం యీనాటికీ కోటీ ప్రాంగంణంలో, ఉద్యానవనంలో గుబాళిస్తుంటుంది. ఆ భవనాన్ని, భవన సముదాయాన్ని పూర్వపు వైభవానికి తెచ్చేందుకు యిప్పుడు కృషి జరుగుతుంది. ఆ కాలంలో యితర ప్రముఖ కట్టడం చాదర్‌ఘాట్ వంతెన, ఓలిఫాంట్ వంతెన, సెయింట్ జార్జి చర్చి మొదలైనవి వున్నాయి. 1831లో నిర్మించిన ఓలిఫాంట్ వంతెన యీ నాటికీ సికింద్రాబాద్ స్టేషన్ వద్ద నిలిచి వుండగా, 1863లో నిర్మించిన సెయింట్ జార్జి చర్చి, గన్‌ఫౌండ్రీ ప్రాంతంలో సగర్వంగా నిలిచి, వేలాగి మంది భక్తుల పాద స్పర్శతో పులకిస్తోంది.

ఇక సికింద్రాబాద్ కథ. 1798లో కుదిరిన అనుబంధ ఒప్పందం ప్రకారం బ్రిటిష్ ఈస్ట్‌యిండియా కంపెనీ వారి దళాలకు నిజామ్ రాష్ట్రంలో శాశ్వత ఆవాసం కల్పించి, ఆర్థికపరమైన రాయితీలు కూడా యిచ్చారు. ఈ దళాలకు కేంద్ర కార్యాలయంగా ఒక ప్రాంతం కేటాయించాలని కూడా నిర్దేశించారు. ఆ ప్రకారమే 5వేలమంది బ్రిటిష్ సైనికులు హైదరాబాద్  చేరుకొని హుస్సేన్‌సాగర్ చెరువుకి ఉత్తర నాలుగా చదరపు కిలోమీటర్ల భూమిని ఆక్రమించుకున్నారు. ఈ కంటోన్మెంట్ ప్రాంతం 60 ఏళ్ళ కాలంలో 17 చదరపు మైళ్ళకి పెరిగింది. 1806లో యీ ప్రాంతానికి నాజామ్ సికందర్ జా పేరిట సికింద్రాబాద్ అని నామకరణం చేశారు.

సికింద్రాబాద్ పెరుగుదల 1798 నుంచి 1835 వరకు ఒక మాదిరిగా 1836 నుంచి 1874 వరకు మరో విధంగానూ జరిగింది. మొదటి దశలో తూర్పు నుంచి పశ్చిమానికి విస్తరించిన యీ ప్రాంతంలో మూడు స్థానిక ప్రాంతాలు వుండేవి. సైనికుల బ్యారక్స్, అధికారుల యిళ్ళు, స్థానికులు వుండే జనరల్ బజార్ యిందులో భాగాలు.

అయితే, 1836 నుంచి సికింద్రాబాద్‌లో తూర్పు, పశ్చిమ దిశలో పెరగడం మానేసింది. తిరుమలగిరి, బోయిన్‌పల్లి, బొలారం అభివృద్ధి ఆగింది. ఆ తర్వాత సికింద్రాబాద్ హైదరాబాద్ దిశగా విస్తరించడం ప్రారంభమైంది.

బ్రిటిష్ కంటోన్మెంట్ కావడంతో సికింద్రాబాద్ అభివృద్ధి, సంస్కృతి హైదరాబాద్ నుండి చాలా భిన్నంగా జరిగాయి. సెయింట్ జాన్స్ చర్చి, సెయింట్ మేరి కాథెడ్రాల్  ప్రముఖ కట్టడాలు. స్థానికుల ఆవాసంలో

హిందూ మహంకాళి ఆలయం కేంద్ర బిందువు. పర్షియన్ కాక ఇంగ్లీష్ అధికార భాష. ఉర్దూ కాక తెలుగు స్థానిక భాష. వ్యాపార కార్యకలాపాలు పెరగగా హైదరాబాద్‌లో ప్రాచీన రాచరిక వ్యవస్థ కొనసాగింది. ఇన్ని భేదాల, భిన్నత్వం వున్నప్పటికీ రెండు నగరాలు సైనిక, ఆర్థిక అనుబంధం ద్వారా ఒకటిగా విలీనమయ్యాయి.

1874 నుంచి భవన నిర్మాణ కార్యకలాపాలను బట్టి హైదరాబాద్ వాస్తు శిల్ప చరిత్రను రైల్వే దశగా అభివర్ణించవచ్చు. 1855లో బొంబాయికీ, మద్రాసుకీ మధ్య గ్రేట్ ఇండియన్ పెనిన్సులార్ రైల్వే రైలు మార్గం నిర్మించదలచినప్పుడు ఆరవ నిజామ్ ప్రధాన మంత్రి అయిన ఒకటవ సాలార్‌జంగ్, హైదరాబాద్‌కి కూడా యీ మార్గంలో చేర్చాలని ప్రతిపాదించారు. వాడీ నుంచి సికింద్రాబాద్‌కి యీ విధంగా మార్గం ఏర్పడి 1874లో ప్రారంభోత్సావానికి నోచుకుంది.

ఆ తర్వాత దక్షిణ దిశగా మహబూబ్‌నగర్‌కి కాచిగూడా నుంచి హుస్సేన్‌సాగర్, బేగంపేట, ఖైరతాబాద్ స్టేషన్లతో పాటు హైదరాబాద్ స్టేషన్ సమీపంలో నిజామ్ కోసం ప్రత్యేకమైన ప్లాట్‌ఫామ్స్, షాహీ ప్లాట్‌ఫామ్ కూడా నిర్మించారు. సికింద్రాబాద్, హైదరాబాద్ రైల్వేస్టేషన్ల భవనాలకు ఎన్నో మార్పులు చేయగా, అవి ప్రస్తుత రూపానికి చేరుకున్నాయి. సికింద్రాబాద్‌లో రైల్వే కేంద్ర కార్యాలయం వుండడం వల్ల, వాటికి అనుబంధంగా వున్న అనేక కార్యాలయాలను నిర్మించి, అనుబంధానం చేసి, సికింద్రాబాద్‌లో అనేక ప్రాంతాలను రైల్వే ప్రాంతాలుగా, కాలనీలుగా అభివృద్ధి చేశారు.

నాంపల్లిలోని హైదరాబాద్ స్టేషన్ భవనం మహమ్మదన్ శైలిలో నిర్మించింది. నిజామ్ ఆ కాలంలో యీ స్టేషన్‌లోని ప్రత్యేకంగా నిర్మించిన ప్లాట్‌పారం నుంచి ప్రయాణాలు చేసేవారు.

జేమ్స్ స్ట్రీట్ రైల్వేస్టేషన్ హుస్సేన్‌సాగర్ ఒడ్డు నుంచి, సికింద్రాబాద్‌లో ప్రధాన వాణిజ్య, వ్యాపార వీధులైన జనరల్ బజార్‌కి వెళ్ళే దారిలో వుంటుంది.

రైలు మార్గాల నిర్మాణంతో హైదరాబాద్, సికింద్రాబాద్ జంట నగరాలుగా రూపు దిద్దుకున్నాయి. ప్రాంతీయంగా కూడా అనేక మార్పులు వచ్చాయి.

వాణిజ్య మార్గాలు మచిలీపట్నం నుంచి బొంబాయికీ, మద్రాసుకీ

మారాయి. హైదారాబాద్ ఉత్తర దిశలో అభివృద్ధి చెందేలా తోడ్పడాయి. జంటనగరాల పారిశ్రామికాభివృద్ధికి దోహదం చేశాయి. 1874కి ముందు ఆధునిక పరిశ్రమలు లేని జంటనగరాల్లో రైల్వే కార్ఖానాలు, కర్మగారాలు పారిశ్రామికీకరణకు శ్రీకారం చుట్టాయి. మరోపక్క బేగం బజార్, చాదర్‌ఘాట్, రెసిడెన్సీ కోఠీ బజార్ల మధ్య పెరిగిన రాకపోకలు 1897లో నాలుగవ వంతెన ముసలంజంగ్ వంతెన నిర్మాణానికి దారితీశాయి.

1908లో మూసీనదికి వచ్చిన వరదల వల్ల నదికిరువైపలా నగరం అల్లకల్లోలమై పోయింది. మూసీ ప్రవహించే దారంతా భీభత్సవం నెలకొన్నది. ఈ వరదల నేపథ్యంలో, విధ్యంసం పునరావృతం కాకుండా చూసేందుకు తీసుకోవలసిన చర్చల గురించి నిపుణుడైన ఇంజనీరు సర్.విశ్వేశ్వరాయను నిజామ్ ప్రభుత్వం సంప్రదించినది. 1909లో సమర్పించిన తన నివేదికలో ఆయన, ఉస్మాన్‌సాగర్స్, హిమాయత్ సాగర్ వంటి చెరువుల నిర్మాణం జరిపి, మూసీకి చేరుకునే నీరు, ముందుగానే చెరువుల్లోకి వెళ్ళి పోయేటట్లు చేయాలనీ, ఒడ్డున అటూ యిటూ పెద్ద భవంతులు నిర్మించాలనీ సూచించారు.

1915 కల్లా హైదరాబాద్ మునిసిపల్ సర్వే మ్యాపలు తయారు చేయగా, సర్ విశ్వేశ్వరాయ సూచనల అమలు కోసం నగరాభివృద్ధి బోర్డు (సి.ఐ.బి)ని నెలకొల్పారు. ఈనాడు మనకి వాడుకలో వున్న ఉస్మానియా ఆసుపత్రి, శాసనసభ, హైకోర్ట్, స్టేట్ సెంట్రల్ లైబ్రరీ వంటి భవనాలన్నింటినీ సిఐబియే నిర్మించింది. పాత నగరంలో గోడలు ధ్యంసం చేసి, కొత్త రహదారులు పరచింది. 1947లో స్వాతంత్ర్యం సిద్ధించేంతవరకూ, ఆ తర్వాత నిజామ్ పాలనకి తెరపడేంతవరకు యీ బోర్డు పని చేస్తూనే వుంది. స్వాతంత్ర్యానంతరం, గత యాభై ఎనిమిదేళ్ళ కాలాన్ని హైదరాబాద్ వాస్తు శిల్ప చరిత్రలో ఆధునిక యుగంగా అభివర్ణించవచ్చు.

రాజులు పోయారు, రాజ్యాలు పోయాయి. ఆధునికత పరవళ్ళు తొక్కుతూ హైదరాబాద్ నగరాన్ని ముంచెత్తింది. పొగమంచు ప్రతివీధిలో, ప్రతి సందు మొహలాల్లో , ప్రతి సుదూరభవనంల్లోకి ఆవరించింది. అభివృద్ధి పథంలో శతాబ్దాల నడక, గడచిన యాభై ఏళ్ళలో పరుగుగా మారింది. ఈ సామ్రాజ్యమే ఒక పూర్తి ప్రపంచంగా, యీ నగరమే వెచ్చని గూడుగా బ్రతికిన తరాల వారసులు, ప్రపంచానికి కిటికీలు తెరచి, కొత్త పవనాలను ఆహ్వానించారు. ఆరు బయట తిరుగాడుతున్న కలలను చేయి చాచి అందుకొని, యిక్కడ ఆవిష్కరించారు. భూగోళమంతా ఆత్రంగా వేసిన అడుగుల జాడలను తమ స్వంతగడ్డ మీద ముద్రించారు. సాంకేతిక పరిజ్ఞనం విశ్వవీక్షణం, కొత్త సంస్కృతుల సమ్మేళనం, కొత్త భాషలు కొత్త నిర్వచనాలు, కొత్త భాష్యాలు- అన్నింటినీ యీ నగరం శరీరంపై అద్దారు. రేపటిని యీ రోజే అందుకోవాలన్న తపనతో నిన్నటి రోజును మరచిపోతున్నారు.

ఇది మన దేశంలోనే కాదు, ప్రపంచ వ్యాప్తంగా ఆధునికత, అభివృద్ధి పథంలో పయనిస్తూ, ఎన్నో శకాల చరిత్ర కల దేశాలన్నీ కూడా ఎదుర్కొనే సంకటమే. అభివృద్ధికి పర్యావరణానికీ, ఆధునికతకు

సంప్రదాయానికీ, చరిత్రకూ, భవిలష్యత్తుకీ వారసత్వానికీ, అత్యాధునిక నిర్మాణ పరంపరలకీ మధ్య సమతౌల్యం సాధించలేని అశక్తత మన దేశం, మన నగరం ఒక్కదానిదే కాదు ఇది ప్రపంచంలోని అనేక దేశాల్లో పొకడ.

హైదరాబాద్‌లో వున్నంత సాంద్రతతో వారసత్వ కట్టడాలు, భారతదేశంలోనే యింకే నగరంలోనూ లేవని చెప్పడం సబబే అంటారు. వాస్తు శిల్పులు, చరిత్ర కారులు పర్యాటకభివృద్ధి ప్రాధాన్యతాంశాల్లో ఒకటిగా వున్న సమకాలీన విధానాలకు అనుగుణంగా చారిత్రక కట్టడాలను అభివృద్ధిపరచడం అవసరమనీ, ముఖ్యంగా విదేశీ పర్యాటకులను ఆకర్షించేది శతాబ్దాల మన వారసత్వమే వారు వాదిస్తున్నారు.

అయినా, అభివృద్ధి పేరిట భవనాల కూల్చివేత ఆగడం లేదు. చారిత్రక కట్టడాలు, ప్రాసాదాలు, ప్రాంగణాల విధ్వంసం మానడం లేదు. శతాబ్దాల కాలం నుంచి నిలచిన జీవన స్మృతులను మట్టిలో రాయడం మానడం లేదు. చట్టాలు కట్టుదిట్టంగా వున్నా చులకన పోవడం లేదు. చరిత్ర ఆనవాళ్ళు మన రేపటి జీవితానికి అవసరం. అగమ్యగోచరంగా తిరగకుండా, సరైన దారి పట్టాలంటే యీ తరాలకు, నిన్నటి తరాల ఆశీస్సు అవసరం.

అంతర్జాతీయ ప్రమాణాల ప్రకారం మనకున్న అమూల్యమైన వారసత్వాన్ని పరిరక్షించుకోవడం అతి ముఖ్యం. ప్రజల్లో యిప్పటికీ యీ విషయంలో వెల్లివిరిసిన చైతన్యం హర్షం కలిగించేదే. అయినా కూడా యింకా అవగాహన, సానుభూతితో మన వారసత్వం పట్ల సగర్వభావం అవసరం. అప్పుడే భారతీయ సంస్కృతి అనే మహాసముద్రంలో బిందువులమైన మనం ఆ సంధువు విలువకు ప్రతీకలు కాగలుగుతాము. ప్రపంచానికి ఆదర్శంగా నిలువగలుగుతాము.



